# కథాకావ్యము

(పద్యము)

త్యాగి

ప్రకాశకులు

శ్రీ మార్కండేయ భవనము

నరసరావుపేట

గుంటూరు జిల్లా

౧౯౩౪

 [వెల ౧-౪ అణాలు]

# కృతిసమర్పణము

....○O○....

సీ. ఏమహామహునకు నిద్ధ స్వభావంబు
శాంతియు మితవాక్యసరణి సతత
మేభక్తవర్యుని హితసత్యసంకల్ప
మన్నిట నెఱవేఱు నడ్డులేక
యే సుధీశ్రేష్ఠున కెప్పుడు విజ్ఞాన
సముపార్జనమున నాసక్తి యధిక
మే ధైర్యధుర్యుని నెందు ద్వంద్వము లెవ్వి
మోదఖేదంబుల ముంపఁజాల

వేదయాపరుప్రేమార్ద్రదృష్టివలన
వృద్ధినొందితి విజ్ఞానసిద్ధిఁ గంటి
నట్టి మత్పితృపాదులయంఘ్రియుగళి
కర్పణమొనర్తు నీకృతి నధికభక్తి.

ॐ नमोभगवते ज्ञानानन्दाय.

"క. అమల బ్రహ్మానందా
త్మము సజ్జనసేవ్య మతులతత్త్వాతీతం
బమృతం బగు నిత్యానం
దమ వీవని యర్చ సేతు జ్ఞానానందా."

[ శ్రీ జ్ఞానానందసువర్ణమాల ]

# కృతిసమర్పణము

••••○◯○•••

సీ. ఏమహామహునకు నిద్ధ స్వభావంబు
శాంతియు మితవాక్యసరణి సతత
మేభక్తవర్యుని హితా సత్యసంకల్ప
మన్నిట నెఱవేఱు నడ్డులేక
యే సుధీశ్రేష్ఠున కెప్పుడు విజ్ఞాన
సముపార్జనమున నాసక్తి యధిక
మే ధైర్యధుర్యుని నెందు ద్వంద్వము లవ్వి
మోదఖేదంబుల ముంపఁజాల

వేదయాపరుప్రేమార్ద్రదృష్టివలన
వృద్ధినొందితి విజ్ఞానసిద్ధిఁ గంటి
నట్టి మత్పితృపాదులయంఘ్రియుగళి
కర్పణమొనర్తు నీకృతి నధికభక్తి.

# విషయసూచిక

# పీ ఠి క

ఈ గ్రంథము కథాకావ్యమునందలి పద్యభాగము. నిరుడు ప్రకటింపఁబడిన గద్యభాగమునకుఁ దోడుగా నిది యిప్పుడు ప్రకాశితమై మత్పితృపాదుల కంకిత మీయఁ బడినది. నా కప్పుడప్పుడు స్ఫురించిన భావములు కథారూపమున నిందుఁ గలవు. విడిగ నున్న చాటువులనుగూడ ప్రకీర్ణమను శీర్షిక క్రిందఁ జేర్చితిని. ఇట్లు గద్యపద్యాత్మక మగుకథా కావ్యము మన్మాతాపితల కంకితము గావించి రసజ్ఞు లగుపాఠకుల యెదుట నుంచుచున్నాను.

ఇందు 'సహృదయత్వము' అను పద్యమునందలి భావము నా చిన్ననాటిది. 'బోధిగుహ' అను పద్యమునందలి భావము గంగోత్తరవద్దనున్న బోధిగుహయందే వ్రాయఁబడినది. గంగకు జన్మస్థాన మగుగోముఖ కైలాసమును గాంచిన తరువాత నది స్ఫురించినది. 'మానవోదంతము' పెద్దలవలన విని నన్నయభట్టారకుని సీసపద్య నియమముల ననుసరించి వ్రాసితిని. 'యోగిని' కలలోని వృత్తాంతము. సాంసారికమైన శ్రద్ధయు వాత్సల్యమును యోగమను పేరునకుఁ దగినవనియు, నట్టి యోగమున సగ్రస్థానము నలంకరించిన యవ్వ, 'యోగిని' యను పేరున కర్హయని భావించి యీ పద్యమున కానామ ముంచితిని. 'సహనము' లార్డువాలన్నియ్యూ వ్రాసిన

హిందూదేశ వృత్తాంతములనుండి గ్రహింపఁబడినది. విప్పర్ల
యను గ్రామసమీపమునఁ బెక్కేండ్లు జీవించి 1923 సంవత్స
రమునఁ బెద్దగాలికిఁ బడిపోయిన పెద్దమఱ్ఱినిగూర్చినశో
గీతికయే, 'పెద్దమఱ్ఱి' యనుపేరఁ బఱఁగుచున్నది. 'ఇరువురు
అను పద్యము దాచేపల్లిలో నాగులేటి యొడ్డున 1928 సంవత్స
ప్రారంభమున నారంభింపఁబడి 1933 సంవత్సరమునఁ బూర్తి
చేయఁబడినది. మిగిలినవి సందర్భోచితముగ వ్రాసినవి.

ఈ గ్రంథమునందలి పెక్కుభాగములను సవరించు
టలోఁ దోడ్పడిన శ్రీకవిశేఖర సూక్తిసుధానిధి వడ్డాది సుబ్బా
రాయఁడు గారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ప్రూఫులు చూచుటలోఁ దోడ్పడిన శ్రీ మల్లాది లక్ష్మీ
నృసింహశాస్త్రిగారును గ్రంథమును శీఘ్రముగ ముద్రిం
యిచ్చిన సరస్వతీ ప్రెస్ ప్రొప్రయిటర్లు శ్రీ అద్దేపల్లి లక్ష్మ
స్వామినాయఁడు గారును నా కృతజ్ఞతకుఁ బాత్రులు.

ఇట్లు
సజ్జనవిధేయుఁడు
'త్యాగి'

# సరస్వతీ సంబోధనము

చ. పలుకు సరస్వతీ తెలుఁగుఁ
బల్కుల సుశ్రుతి మేళగించి, పె
ల్లలమి వసంతసూనముల
యందలి చల్లని తీయజల్లులై
లలనల పల్లవాధరము
లన్ జెలువారు సుధాప్రవాహమై
జలజల వాఱు సత్ఫల ర
సంబులఁ జక్కెరలన్ హసింపఁగన్. ౧

చ. కలకలరావముల్ సెలఁగఁ
గా మృదుపల్లవరాజి మెక్కి కో
యిల కులముల్ కుహూ యని ధ్వ
నించెనొ కేకులు దివ్యమేఘశో
భలఁ గని విచ్చి పింఛముల
బంధురరీతిగ నాలపించెనో
ఫలరస మాని కీరములు
పల్కెననన్ వచియింపు శారదా. ౨

చ. వెలయుచునుండఁ బాదముల
విస్ఫుటమై గలుగల్లు మంచు ని

ర్తల యతులున్ గణంబులును
ప్రాసము లాదిగ గజ్జె లందెలై
సలలితమైన భావము సు
శబ్ద గుణంబులు రీతిసంపదల్
గలిగి యలంక్రియాసహిత!
లాస్యమొనర్ప గదమ్మ భారతీ!

చ. కలిగె ఫలంబు వాకునకుఁ
గమ్మని సత్కథలన్ వచింపఁ బ
ల్కుల నమృతంబు గల్గు కవి
లోకము నం దను వాఁడు దీర్ఘఁగా
గలిగెను దావకీనకృపఁ;
గమ్ర కవిత్వపటుత్వసంపదల్
గలుగ ననుగ్రహింపఁగదె
కంజజురాణి! భజింతు వాణి! నిన్.

# కథాకావ్యము

## సహృదయత్వము



చ. కలదొక చిన్నవాఁగు చిర
కాలమునుండియు మాదుపల్లెకున్
వెలుపలఁ బాఱుచుండును వి
విక్తతలంబునఁ జెల్లు గుట్టలున్
గల పొలిమేర యద్ది కల
కంఠకుహూరవముల్ సెలంగు ని
ర్మలవనసీమలున్ గలవు
ప్రాంతములందు మనోహరంబుగన్.

చ. సలలితహంసతూలమృదు
శయ్యలు రా లగుఁ దత్సుసైకత
స్థలములఁ బోల్ప, స్వచ్ఛమగు
స్వాదుజలంబులతోడ నుంతయేన్
దులమె సుధారసంబు, నది
తోయము సల్పెడు మందమందసం
చలనము హంసయానల ప్ర
చారములన్ వెలివెట్టు నిచ్చలున్.

చ. కలచుచు వారిపూరమును
గ్రందుగ వారిచరంబు లుండెడున్
గొలఁకొల మంచుఁ జెంతలను
గొక్కెర లాదిగఁ బక్షు లుండు వే
బిలబిల నీర మాన సర
విన్, జనుదెంచును గృష్ణసారముల్
మిలమిల లాడు చవ్వలన
మిక్కిలిగాఁ జరియించుఁ గీటముల్.

చ. వలయముగా నొకొక్కెడను
వట్రువసుళ్లను నొక్కచోటఁ దుం
దిలముగ నొక్కదేశమునఁ
దీవవలెన్ మఱియొక్కభూమియం
దలమి విశాలమై యొకట
నద్భుతరూపము లైన దీవులన్
జులుకన నిర్మితిన్ సలుపఁ
జోద్యముగా వహించు నీరముల్.

చ. గలగలనాదునన్ మెఱికఁ
గప్పుచు రాలను గ్రిందఁ ద్రోయుచున్
సులభముగాను వల్లములఁ
జొచ్చుచు నొడ్డుల మెల్లఁ గోయుచున్
కలసుమనోజ్ఞతాళయుత
గానముఁ బోలెడు మర్మరధ్వనిన్

వెలయును వాఁగు చిన్మయుని
వేయువిధాల నుతించునో యనన్. ౫

క. పొలుపుగ సైకతములపై
నలదర్భలు పూరులాది యల్లల నాడున్
బలుపెక్కెంబులచాడ్పున
నిలచి నదీప్రాజ్యరాజ్యనియతిని దెలుపన్. ౬

చ. కొలకులతో రహించు వన
కుంజములందలి పుష్పసౌరభం
బులఁ గొనివచ్చి వారికణ
ముల్ వహియించుచు మందగాములై
యలమి శ్రమాపనోదకము
లై ప్రసరించెడి పిల్లగాడుపుల్
జెలువము మీఱఁ బాంథులకుఁ
జెమ్మటఁ బాపి సుఖంబు నిచ్చెడిన్. ౭

చ. కలదు కవిత్వ మీయెడను
గమ్మనిభావము లుద్భవించు నీ
నెలవున మేనువాల్ప; నవ
నిన్ సుఖదుఃఖములెల్ల మాని యీ
లలితవినోదసంపదల
లాలన మందెడువాఁడె ధన్యుఁడం
చలరుచు సైకతస్థలుల
హాయిగఁ బండగ నొక్క రేఁపటన్. ౮

ఉ. తీరమునందుఁ గల్గు నొక
    తిన్నని బాటను నేగుచుండి వె
వ్వారలొ కొంద ఱిట్లనిరి
    "వహ్వారె! పిల్లఁడు తిప్పలందునన్
గోరి శయించినాఁ డితఁడు
    కూడును గూరయు నొల్లఁడేమొ, వ్యా
పారములేని వారి కిటు
    వంటివె కాలముఁ బుచ్చుమార్గముల్.

ఉ. చల్లని గాడ్పుకోస మఁట,
    చాలును; కాక శరీరమంతటన్
బెల్లుగఁ గల్గఁ బోలు బళి!
    వేడయుఁ బెల్లము నేర్పరింపగా
నొల్లఁడు వట్టితిన్నెలను
    నొక్కఁడు పండగ సిగ్గులేదె యీ
తెల్లులు రాలు నీ ల్లితని
    రేపును మాపును మేపఁ గల్గునే.

ఉ. ఎందుకు నిష్ప్రయోజనఁపు
    హీనఁపువాఁ గిది, చెట్టుచేమ లే
దిందుల, వట్టి చౌడు లిట
    నేమని సంతసమందఁబోలు నే
యందము గల్గు నిచ్చట స
    మాదరముం గన వర్షకాలమం

దెందఱకో యుపాయము ల
నేకములన్ గలిగించెదున్ గదా. ౧౧

చ. చెఱువును గాదు పంటలకుఁ
జేరువభూముల కేత మెత్తఁగా
వరలుకొలంకు గాదు, వడిఁ
బాఱెడు నేఱును గాదు, పంట క
క్కఱకును వచ్చు నేదియును
గా దిది, యెయ్యది చూచి యీతఁ డే
వెఱవున సంతసించు నిట,
వెఱ్ఱియొ పిచ్చియొ వీఁడు గావలెన్." ౧౨

క. అని నింద సేసి యరిగిరి
విని యూరక యుంటి నేను, విశ్వములోనన్
ఘనవస్తుల నిజతత్త్వముఁ
జనునె యెఱుఁగఁ బామరులకు సహృదయులవలెన్. ౧౩

శా. "అన్నా హంసమ! యెందునుండి యిటు రా
నయ్యెన్", "బకశ్రేష్ఠ, సం
పన్నశ్రీయుత దివ్యమానససరః
ప్రాంతంబునందుండి", "యే
మున్నన్ గాంచితి వందు", "కాంతియుతమై
యొప్పారు రత్నంబులే",
"యెన్నన్ నత్తలు పీతలున్ గలవె", "లే"
"హీహీ! హిహీ యింతియే". ౧౪

# బో ధి గు హ

## ౧. హి మా ల య ము



చ. శివునకు నాటపట్టుమ ప్రసిద్ధిగ
జన్మము దాల్చుగట్టు త
చ్ఛివయును రుద్రుఁ డెల్లతఱి
సిద్ధముగా విహరించుమెట్టు సం
భవ మగుమిట్ట జాహ్నవికి
భవ్యులు స్కంద గణేశ వీరభ
ద్రవరుల కునికిపట్టు హిమ
రాజితపర్వతరాట్టు నెన్నెదన్.

ఉ. నందియు భృంగియున్ మొదలు
నంతబల ప్రమథాళివాసమున్
వందితధాతృముఖ్యసుర
వల్లభనిత్యమహావికాసముం
విందగు నప్సరోంగనల
వీణియతంత్రులచే సుధామధు
స్యందివిలాసముం ప్రబల
సత్త్వవిభాహిమవాస మెన్నెదన్.

చ. ఋషులు యుగాదినుండి ముని
వృత్తి వహించిన పల్లె క్రీడయుం

మిష< జని భంగముల్ సలుప
మేనక మున్నగ దేవకన్యకల్
సుషమను జూపు నిల్లు విధి
చోదితతత్ప్రళయాంతమందునన్
విషయము కెల్లతల్లి సద
భీష్టదకల్పకవల్లి నెన్నెదన్. ౩

చ. మును రఘువంశజుల్ ముదిమిఁ
బొంది తపంబును జేయుచోటు న
ర్జునునకు నీశుఁ డద్భుతము
చొప్పడ దర్శన మిచ్చుపాటుఁ దా
మును తుది పాండునందనులు
మున్నగ స్వర్గము నెక్కునేటు నా
మునుపటిగాథ లన్నిటి క
మోఘపుమాటును సంస్తుతించెదన్. ౪

శా. కైలాసాద్రికిఁ బ్రాంతముల్ శుభమనః
కాసారసంక్రాంతమున్
లీలావర్తితసిద్ధసాధ్యగణని
ర్ణిద్రప్రభాశ్రాంతమున్
ప్రాలేయ ప్రతిబింబితార్కకిరణ
ప్రాగల్భ్యభాస్వాంతముల్
ఫాలాక్షార్చనశాంతముల్ సుహిమవం
తంబుల్ ప్రశంసించెదన్. ౫

సీ. ఆవంకఁ జూడ నేత్రానందకరము గౌ
రీశంకరాఖ్య ముర్వీధరాగ్ర
మీచాయఁ జూడఁగా నెంతేని మానసం
బలరించు బదరీశు నద్రిసీమ
ఆచెంతఁ జూడ నాహా గోముఖం బది
జన్మసాఫల్యంబు సలుపుశృంగ
మీజాడఁ జూడ మేనెంతొ గగుర్పాటుఁ
గల్గించు కేదారకమ్రసీమ
గీ. ఎన్నియని పేరుపేరున నెన్నఁగలము
స్వచ్ఛనీహారవర్ష సంఛన్న విపుల
సురుచిరోన్నతశృంగసంశోభితంబు
వర్ణనాతీత మీ హిమవన్నగంబు.
సీ. ఇదె మాధవీలత గద, సౌరభము వెద
జల్లి ఘ్రాణము నుల్లసిల్లఁజేయు
ఇదె శిరీషాగము గద, కేసరంబుల
కన్నుల కమృతమై సున్నితమగు
ఇదె ప్రియాళుద్రువుగద, పుష్పవిస్ఫూర్తిఁ
జూడ నబ్బురమయి సొంపుఁగులుకు
ఇదె దేవదారువు గద, రసస్యందియై
కర్పూరసౌరభ కలితమగును
గీ. ఆటవికమైన జాజులు నలగులాబు
లల్లిబిల్లిగ నల్లిన మల్లెలాది

గలవు సంజీవనియు నందు కాంతినిండు
పండు సర్వంబు హిమమిట నిండియుండు. ౭.

సీ. పులిజాడ లివి కేసరులజాడ లివి సివం
గులజాడ లివి యడుగులను జూడ
ఏనుంగు లివి జలం బానంగ నేతెంచె
నివి యెలుంగులును పేరెనుము లివిగో
కస్తురిమృగములు గల్గుచుండుటఁ జేసి
నిస్తులగంధంబు నెగడు నిచట
కుందేళులును గొమ్ముపందులు నియ్యవి
వందపందల లేళ్లమంద లివిగో

గీ. యనుచుఁ బాంథుల సంభ్రమాత్యద్భుతముల
యందు మున్గంగఁ జేయుదు రిచట భిల్లు
లమలగంగాంబుకణపూర్ణ విమలహిమను
మారుతంబుల శ్రాంతివిదూరు లగుచు. ౮

సీ. ధాన్యసంపదలకుఁ దావులీ కొండలు
కొండ లీయవి † చూలు పండులీను
గంధకద్రవ్యంబు గల్గునీకొండలు
కొండ లీయవి ధాతుమండితములు
గైరికమదములు గల్గునీకొండలు
కొండ లీయవి ‡ చీడి కిందులగును

---

† చూలు = ఒక విధమగు పండు.

‡ చీడి = ఒక విధమగు దేవదారు చెట్టు.

భూర్జవృక్షంబులఁ బొల్చునీకొండలు
కొండ లీయవి రేగుపండు లిచ్చు
గీ. హిమముక్రిందను బచ్చిక లిచటఁగలవు
లవణ మిచ్చట దొరకు మేల్రాంకవముల
కివియె తావులు స్వర్ణంబు నిచట దొఱకు
నంద్రు తద్జ్ఞులు హిమవదహార్యమందు.
సీ. ఈ గంగగోముఖం బెనసి భాగీరథి
యనఁగ భర్గుజటాళి నరుగుదెంచు
నీగంగ కేదారశృంగంబునుండి మం
దాకినీనామంబునఁ బ్రవహించు
నీగంగ జాహ్నవి నాఁగ భోటా † నను
దేశంబునుండి యేతెంచువడిని
ఈగంగ బదరీవనేశ్వరు దర్శించి
యలకనంద యనంగ మలయుచుండు
గీ. ననుచు గంగను గలియుపాయల వచింత్రు
గంగ దయచేత మార్గంబు గలుగు నిచట
నంబరముఁ జుంబనము సేయునట్టిగిరుల
యందు నయ్యది లోఁతులోయల ఘటించు.
సీ. ఒకయెడ నాకాశ మొరయుచునుండు వే
ఱొకవంకఁ బాతాళ మొనరఁ దాఁకు
ఒకదెసఁ గటికిరాళ్లకుఁ దావలంబు వే
ఱొకవంకఁ బచ్చిక కున్కిపట్టు

† భోటాను = టిబెట్టు దేశము.

ఒకచాయఁ గమ్మతావికిఁ దానకంబు వే
ఱొకజాడ శీతలోదకనిధాన
మొకయెడ పొదరిండులకు నివాసమును వే
ఱొకదెస పెనుమ్రాకులకును నెలవు
గీ. ఒక్కయెడ మంచుగడ్డల కిక్క సురభి
మందశీతలవాతసీమం బొకయెడ
నగుచు గంగాప్రవాహంబు ననుగమించు
పాంథసంసేవితము హిమవత్పథంబు. ౧౧

సీ. ఇదె వ్యాసగుహ యాతఁ డిందె సూత్రాకృతిఁ
దాల్చియుండునటండ్రు తజ్జ్ఞజనులు
ఇదె ముచికుందునిసదన మంద్రతనికి
నచ్యుతుం డిటనె ప్రత్యక్షమయ్యె
ఇదె జామదగ్న్యుని యిరవైనశృంగ మిం
దింకను నతఁడు వసించునండ్రు
ఇదె బదర్యాశ్రమ మిందె తపోవృత్తి
నుంచిరి నారాయణుండు నరుఁడు
గీ. ఇదియె కేదారమను శృంగ మిందు సురము
సలిపి తప మాచరించెను శంకరుండు
నిఁకను వేలును లక్షలు నిట్టితావు
లన్నివివరించి తెలుప నా కలవియగునె. ౧౨

సీ. ఆతపంబును శీత మనెడు భేదము లేక
ఋషులు తపం బాచరింతు రిచట.

ఆకలి తృష్ణయు నన్న వెఱుంగక
ఋషులు తపం బాచరింతు రిచట
ధ్యాతయు ధ్యేయంబు ననెడు భేదము లేక
ఋషులు తపం బాచరింతు రిచట
అహమును రాత్రియు నన్న వెఱుంగక
ఋషులు తపం బాచరింతు రిచట

గీ. శాశ్వతబ్రహ్మవృత్తిని జడులువోలె
నుందు రత్యద్భుతంబుగ యోగు లిచట
యక్షకిన్నరగంధర్వులాదిగాఁగ
దేవతల కిది విహరించుదివ్యభూమి.

సీ. గంగలోనుండియు వెంగలు లయి తరిం
పంగఁజాలని జంతువారమట్లు
కొలనిలోపలనుండి కలువలమధువును
గ్రోలనేరని భేకకులమువోలె
దేవాలయంబున సేవఁజేయుచును దో
సములను సల్పు నర్చకులభంగి
ముక్తులకడనుండి యుక్తపథంబు నా
సక్తిఁగోరని మూఢజనులభాతి

గీ. మణులవ్యాపారములఁ జేయు వణిజులవలె
నిధులకడనుండు రక్షకనిచయమట్లు
శ్రీమహేశుని శిరసునఁ బాములవలె
భిల్లు లీపుణ్యభూమి వర్తిల్లుచుండ్రు.

## ౨. గంగోత్తరలోయ



ఉ. పాలసముద్రమో యనఁగ
భాసిలు కౌముది నాఁగ దివ్యగం
గాలహరీమనోహరసు
కాంతివితానమనంగ నిర్మల
శ్రీల నొసంగు నీశ్వరు శ
రీరరుచిప్రకరంబునాఁగ ది
గ్జాలము నిండుకొన్న ఘన
సారము నాఁజను గోముఖంబటన్. ౧౫

ఉ. అంతటఁ జెన్నుమీఱు ధవ
ళాకృతి చుట్టువెలుంగఁ గన్ను ల
త్యంతము విభ్రమంబుఁ గొన
నల్లల భాస్కరుభానుసంఘముల్
వింతగ నాట్యమాడుచును
వేడుకఁజూప విచిత్రవర్ణముల్
మంతనమాడ మేఘతతి
మానితగోముఖశృంగ మెప్పెడిన్. ౧౬

చ. చల్లని గాలివీచు మఱి
చల్లఁదనంబున నీరు స్ఫాటి కా
త్యుల్లసదాకృతిం గనును
నల్లము జల్లను నుత్కటంబుగా

వెల్లువగాఁగ గోముఖ సు
విస్ఫుటకాంతు లనాదినుండియుం
బెల్లుగఁ బేరిగడ్డలయి
మించును మంచు తళత్తళచ్ఛవిన్. ౧౭

ఉ. తెల్లని గోముఖం బమృత
దీధితులీనెడు రెండుశృంగముల్
పెల్లుగ నాకసంబు నగ
లించెడు లాగునఁ దోచుచుండ మే
నెల్లను భస్మలేపన స
మృద్ధతఁ దేజరిలంగ నూర్ధ్వబా
హుల్లసదాకృతిం దనరు
యోగియునాఁ దనరారుచుండెడున్. ౧౮

ఉ. ఇమ్మహి నెల్లలోకులు త
రింపగ వారల ఘోరపాప పం
కమ్ముఁ దొలంగఁజేయుటకుఁ
గా జలరూపముఁ దాల్చినట్టి గం
గమ్మను గోముఖంబు తన
యాననగహ్వరమందు వెల్వడఁ
సమ్మతిఁజేయు దృశ్యమును
సారెకు భక్తినిగాంత్రు యాత్రికుల్. ౧౯

ఉ. అక్కడనే కృపాకలిత
యౌచును లోకుల పాపసంచయం

బొక్కట రూపుమాపఁగ మ
హోద్ధతి వెల్వడి గంగ తీవ్రస
మ్యక్కలితార్భటిన్ గడు ర
యంబున నోంకృతి నిష్ఠురంబుగా
దిక్కులఁ బర్వఁజేసెడును
దేవత లబ్బురమంది చూడగన్. ౨౦

ఉ. కొండలఁ గొండలన్ దుముకుఁ
గొండలఁ గొన్నిటి గంగ లీలమైఁ
బిండియొనర్చి మార్గము న
భీప్సితభంగిని నల్పు గోడలం
దండలఁబోలెఁ గూల్చు ఝరి
యందునఁ గొన్ని మహీధ్రశృంగముల్
చండత నిండుయౌవనము
సంధిలకుండను శైశవంబునన్. ౨౧

ఉ. గంగను దాటఁగా వశము
గాదు నిరంతరదుస్సహోర్భటీ
సంగతభంగసంఘము ల
సంఖ్యములై చెలరేగెడున్ దదీ
యాంగము సన్నమయ్యును ర
ణాంగణ మధ్యమునందుఁజొచ్చు వీ
రాంగనఖడ్గమట్టులు భ
యానక మెవ్వరు బోదు రడ్డమై. ౨౨

ఉ. ఘోరవిషంబు వెల్వఱచు
క్రూరమహాహియొ దారుణంబుగాఁ
గోరలఁ జూపుఁ బెబ్బులియొ
ఘూర్ణిలు మత్తగజేంద్రమో మహా
పారతరంగసంతతులఁ
బర్వెడు సంద్రమొ కాళరాత్రియో
నా రయ మొప్పఁ గన్పడు న
నాదరముం బెలిఁబుచ్చువారికిం. ౨౩

ఉ. వందనముం బొనర్చి బహు
భక్తిని మజ్జన మాడువారితో
మందమృదూక్తులన్ బలుకు
మంజులఘోషను గంగ పాపముల్
చెందవు మి మ్మటంచును వి
శేషముదం బొనగూర్చు నాకృతిన్
జిందులుఁ ద్రొక్కుచుం బఱచు
శీఘ్రతరంబుగ గోముఖస్థలిన్. ౨౪

చ. ఇటువలెఁ గొంతదూర మతి
హృద్యముగాఁ బ్రవహించు గంగ త
త్తటములఁ బొల్చు భూర్జములు
తత్తరుకాండజ పత్రసంతతుల్
చటుకునఁ దీసి లేఖలను
సల్పెదు రందురు యక్షకన్యకల్.

పటుతరవృత్తి మంచుల
శుభస్థితి నయ్యావి వృద్ధిఁ బొందెడున్. ౨౫

ఉ. వీనికిఁ దోడఁబుట్టువులు
వెల్వడు నీవల దేవదారువుల్
పూనిక మంచులందు పనిఁ
బూని సహించుచు శీతవాతసం
తానపరంపరల్ విమల
ధైర్యగుణప్రతిభాప్రదర్శకా
మ్లానవిశాలశాఖలఁ న
లంకృతిసేయు మహీధ్రశృంగముల్. ౨౬

ఉ. పుల్లలు కాగడా లగును
బొందుగ మ్రాఁకులు వంటకట్టెలా
భిల్లుల కాతపుప్రసవ
విశ్రుతకేసరముల్ హరిద్రమౌఁ
బెల్లుగఁ జందనాగరుల
పేర్మిఁ దనర్చును వానిఖండముల్
చల్లనికర్పూరంబగు ర
సం; బుపకారులు దేవదారువుల్. ౨౭

ఉ. ఈవిధివచ్చి జాహ్నవి య
హీనమహాత్మ్యవిభూతితోడఁ దా
నావనముల్ వడిన్ గడిచి
యంతటఁ జేరును నొక్కలోయఁ దీ

ర్థావళి కేఁగుమానవులు
దానిని గంగకు నాది యంద్రు, తా
రేవగ గోముఖంబునకు
నేఁగఁగఁజాలక యందు రీగతిన్. ౨౮

మ. ఇది గంగోత్తరయంచు జాహ్నవికి ని
ద్దే యుత్తరంబంచు ని
య్యెడ భాగీరథి తద్భగీరథున కా
త్మాకారముం జూపెఁ ద
ద్ధృది సందేహముఁ దీఱనంచు నిదియే
శ్రీగౌరికిన్ గుండమై
నదిగా! యంచు నపారభక్తియుతులై
యర్చింతు రీస్థానమున్. ౨౯

చ. ఇటఁ గలకాలమున్ నిలిచి
యెందఱు మానసులు సిద్ధి నొందిరో
యిటఁ దపముం బొనర్చి మఱి
యెందఱు మున్ శ్రుతులన్ గ్రహించిరో
యిట నిరతిన్ వసించి ఋషు
లెంద ఱుమేశునిఁ గాంచఁ గల్గిరో
యెటుల వచింప శక్యమగు
నీమహనీయపదప్రభావమున్. 30

చ. వినినను దత్ప్రభావములు
వీనులవిందగు శాంతి నిచ్చుచున్

మననము: జేసినన్ మన ము
ముందసుఖాంబుధి నీదులాడెదుర్
గనిన వనూనసమ్మదము
గల్గి ముదశ్రులు జాలువాఱు నం
దనిశనివాసులౌ ఋషుల
యాత్మల కెంతటి హర్షమోగదా! 3౧

చ. సనకసనందనాదిముని
చంద్రులకాలమునుండి యిచ్చటన్
వినుతవసిష్ఠగౌతమము
నిప్రవరాదుల నాఁటినుండియున్
మినుమనః నేక మహానటుల
మీఱతి వెలుంగు తపస్సు తేజమే
యనయము సూక్ష్మరీతిగ న
నంతసుఖం బిడు స్పందనం బగున్. 3౨

3 బోధి గుహా బాహ్యము.

---

క. ఈవిమలంబగు లోయను
దా వెలయును నొక్కగుహ యుదారుఁడు విలన
ద్భావుఁ డొకజ్ఞాని దానికిఁ
గావించెను బోధినామకరణముఁ బ్రీతిన్. 33

ఉ. గంగయు బోధిసంజ్ఞగల
కందరవుందరి సంచరించునా
మంగళశీల స్వాగత మ
మందనమాదగవృత్తి నిచ్చు; డా
యంగను నెల్లవర్ణముల
కంతియొగాక సమస్తజాతులన్
రంగుగఁ జూచు నొక్కగతి
రమ్యముగాఁ బ్రణవంబుఁ బల్కుచున్. 38

ఉ. భిక్షు లభించు మానిగణ
విశ్రుతసంతతికెల్ల గంగ కి
ర్పక్షములందుఁ బల్లెలను
భక్తి మహాత్తరమై రహింపఁ దా
మక్షయరీతి వడ్రసస
మంచితభోజన మంగనామణుల్
మోక్షముఁ గోరి పెట్టెదరు
మ్రొగఁగఁ గంకణముల్ కరద్వయిన్. 39

శా. ప్రాతఃకాలమునన్ హిమాద్రిశిఖర
ప్రాంతాతిశీతంబులౌ
వాతంబుల్ మెలమెల్లవీచుఁ దరువుల్
వర్ధిల్ల గంగాకణ
వ్రాతంబుల్ గొనివచ్చి యావిరు లటన్
వాసించు సాధూత్తముల్

ప్రాతఃస్నానము లోంహరా హరహరా
రావంబులన్ జేయఁగన్. ౩౬

ఉ. వాయువుచేతనే శుచిత
వర్థిలుచుండఁగ స్నాన మేల వే
జే యని కొంద ఆంద్రు యతు
లిచ్చట సర్వమలాపహంబు భ
ద్రాయితమావిభూతికిని
దక్కువ యన్ని యటంద్రు కొంద జా
హా; యిఁక బ్రహ్మభూతులకు
నక్క అయుండునె యెట్టి స్నానమున్. ౩౭

శా. మధ్యాహ్నంబున నెండయుం జలియు స
మ్యగ్లీల మిశ్రంబులై,
సుధ్యానంబున బ్రహ్మతేజమును ద
త్సాక్ష్యంపువ్యక్తిత్వమున్
మిధ్యాచింతలు మానుపట్టునను స
మ్మేళంబు లౌనట్టివై
సుధ్యానందకరంబులౌ నెపుడు న
చ్చో హైమశైలంబునన్. ౩౮

శా. సాయంకాలమునందుఁ బయిపయిని భా
స్వద్భానువుల్ పర్వి యా
త్రీయచ్ఛాయలఁ జిత్రవర్ణపటముల్
దీపింపఁగాఁ జేయుఁ బ్రా

లేయోర్వీధరశృంగమేఘతతిఁ ద
    ల్లీలాత్తవర్ణంబులన్
మాయంజల్పు విచిత్రరూపములు బ్ర
    హ్మం బిట్టులే యన్నటుల్. ౩౯

ఉ. రాత్రులయందు వ్యాఘ్రనిక
    రంబులు సింహము లొక్కపెట్టునన్
గోత్రవిభేదకంబుగ న
    కుంఠితగర్జలు సల్పుచున్న నే
యాత్రములేక బోధిగుహా
    ప్రాంతము లొప్పెఁ బ్రశాంతవృత్తిమై
దత్త్రిగుణస్వభావములు
    దాకని యోగుల యాత్మలుంబలెన్. ౪౦

సీ. మింటికై యెగసిన మేఘసంఘాతంబు
    పుణ్యవితానంబు బోధిగుహకు
అడుగునఁ గన్పట్టు నంబుదవ్రాతంబు
    ముఖ్యసోపానంబు బోధిగుహకు
గాలి, ద్వారమునొద్దఁ గదలు మేఘావళి
    పొలుపారు పెందెర బోధిగుహకు
శిరమునఁ గనుపట్టు శరదంబు లభిషేక
    పూర్ణకుంభంబులు బోధిగుహకు
గీ. హిమము వర్షించు మేఘసంఘము సుపుష్ప
చయ సమర్చనసేయు పూజరిగణంబు

గాఁగఁ దాపసులకు బోధికందరంబు
సంతతానందదాయియై వింతఁ గొలుపు. ౭౧

సీ. ఎంతటిపుణ్యంబు నెట్లు చేసెనొ బోధి
గుహాకు నాధార మీకొండ యయ్యె
ఎంతటిసుకృతంబు నెఱిఁగి చేసెనొ బోధి
గుహ కీతరుల్ బంధుకూటమయ్యె
ఎంతటిశుభకార్య మెట్లు చేసెనొ బోధి
గుహాకు నీర్ఝరి యనుంగుఁజెలి యయ్యె
ఎంతటితపము మున్నెట్లు చేసెనొ బోధి
గుహ కీస్థలము జనిక్షోణి యయ్యె

గీ. ఎంతటియదృష్టమో బోధిప్రాంతమందు
సంచరించెడు నీజంతుసముదయంబు
నేమి చెప్పంగవలె యాయదృష్ట మంద్రు
భువనభూషణమును జేరి బోధిగుహను. ౭౨

చ. కపిలలుఁగోవు లిచ్చటను
గానఁగవచ్చును మందమందలై
యపరిమితానురాగమున
సంతతఁ గ్రేఁవుల నాకికొంచుఁ జే
పు పొదుగులన్ స్రవింపగను
బొంగుచు గుమ్మలు కామధేనువే
కృపనిట నిన్నిరూపులు ధ
రించి చరించెడు నట్లు దోఁపఁగన్. ౭౩

ఉ. పేశలమైనరోమములు
పృథ్విని దాఁకఁగ లేళ్లమాదిరిన్
లేశము శ్రాంతిలేక యవ
లీల గిరీంద్రము లెక్కు మేషముల్
పాళఁపువ్రేల్లు గాంచ కవి
బర్వాల మోయును గొండదారులం
గ్లేశముఁ జెందు నెండలకు
క్షీరము లిచ్చును గోవులుంబలెన్. ౨౨

చ. ప్రకృతియె బంధు విచ్చటను
బల్కినఁ బల్కక యున్నగాని యా
ప్రకృతియె మోదదాయకము
భావమునం దెటులున్న గాని త
త్ప్రకృతినిమగ్నులై తుదిని
ప్రాకృతవృత్తిని దాఁటి సాధకుల్
ప్రకృతివిహీనవస్తువయి
భాసిలుచుందురు తత్త్వవేత్తలై. ౨౩

ఉ. బ్రహ్మమయంబు లాట లిట
బ్రహ్మమయంబులు పాట లీయెడన్
బ్రహ్మమయంబు కార్యములు
బ్రహ్మమయంబులు భావసంపదల్
బ్రహ్మమయంబు వృత్తు లిట
బ్రహ్మమయంబులు సర్వసంగముల్

బ్రహ్మామయుల్ మహామహులు
బ్రహ్మవిలీనత నందు రిచ్చటన్. ౪౬

శా. ఏనాఁ డిచ్చటి కేఁగుదెంచి గుహఁ దా
నీక్షించె బ్రహ్మర్షి యా
జ్ఞానానందమహోత్తుఁ డీగుహకు నే
నాఁ డుంచె బోధ్యాహ్వయం
బేనాఁ డిచ్చటఁ దన్మునీశ్వరుఁడు వ
ర్తించెన్ బరంబ్రహ్మమై
యానాఁడే చరితార్థ యయ్యె గుహ య
త్యంతంబు పూజార్హమై. ౪౭

శా. ఏసంకల్పముచేతఁ జేసెను తపం
బేకోరికల్ లేనివాఁ
డేనద్విగ్రహ మర్చఁజేసె నతఁ డిం
దేరూపమున్ లేనివాఁ
డేసత్త్వగుణవృత్తి నుండె గుహ నెం
తే నిర్గుణుండైనవాఁ
డేసన్మోక్షము నాశ్రయించెనో యతం
డే మోక్షమై యుండియున్. ౪౮

ఉ. ఏ లనుమాన మేన వచి
యింతును గల్గినమాట గట్టిగాఁ
జాలఁ దరింప లోకములు
జ్ఞానమునన్ బరమర్షి నిర్మల

శ్రీలఁ దనర్చు రూపమునఁ
జె ప్వగుబోధిగుహాంతరంబు శ్రీ
యా:యమై యెసఁగఁ గరు
ణాకృతి నిచ్చెను "బూర్ణసూత్రముల్." ౮౯

ఉ. ఆతనిస్వచ్ఛకీర్తులయి
యంతటఁ జిమ్ముచుఁ గమ్మవాసనల్
శ్రీ తనరన్ దనర్చు బహు
రీతుల నొప్పెడు మల్లెపూలు బ్ర
స్ఫీతమనోహరాకృతుల
విశ్రుతమాధురిఁ జాటుచుండు వి
ఖ్యాతఫలావళుల్ ఋషిహృ
దంతరసాధుమనోజ్ఞభావమున్. ౯౦

## ౪ బోధిగుహావరణము.

---

క. రెండు వనజ్యోత్స్నలు కా
వుండును ద్వారంబుచెంత నూర్జితవృత్తిన్
నిండువికాసముతోడను
మండనములు గుహకు నగుచు మానితవృత్తిన్. ౯౧

నిండుచీఁకటిరేల నీరెండులతలు
వెన్నెలలుగాయు నట్టులు వెలుఁగుచుండ

మెండుకొను ప్రేమ నీగుహా యండఁ జేరి
దండిగా నాడుచుండును గండుపులులు. ౫౨

ఆ. వె. సింగ మెలుఁగు లేడి సివ్వంగి తోడేలు
నెమలి పాము పిల్లి నిత్య [illegible]
మృగము లిటకు వచ్చి యెలమి యోగీశ్వరుం
డుంచు కరకమందు నుదక మాను. ౫౩

క. సందెలరాగం బెనయుట
సిందూర ప్రభలఁ గలుగఁ జేయఁగ జ్యోత్స్నల్
పొందిక గంధర్వాదులు
డెందంబుల నలరుచున్ నటించెద రచటన్. ౫౪

శా. అతుల్ దన్నెపు భూషణావళులతో
హారిస్వాహాపంబుతో
నక్షీణాగురుధూపవాసనలతో
నవ్యాహతభ్రూలతా
విక్షేపంబుల తోడుతన్ మకరికా
విఖ్యాతపత్రాళితో
యక్షస్త్రీ లట సంచరింత్రు ప్రియభ
ర్త్రాసక్తచిత్తంబులన్. ౫౫

క. జంటలుగా గుహ్యకు లా
వెంటను గింపురుషు లిట్లు వేలుపు లెల్లన్
మంటిమి జన్మము ధన్యము
గంటిమి బోధిగుహ యటంచుఁ గావింత్రు నతుల్. ౫౬

ఉ. బోధిగుహామహత్త్వమొ ను
బోధవిశారదుఁడైన తత్తపో
నాధుమహత్త్వమో యిది య
నంతవికాస మొనంగు నోషధీ
సాధుమహత్త్వమో ప్రణవ
శబ్దదగాంగమహత్త్వ మొక్కొ వి
ద్యాధరసిద్ధసాధ్యసక
లామరసంఘ మిటఁ జరించెడున్. ౫౭

సీ. మేను మేనునఁ జేర్చి మృదువుగా నిమురుచు
నాదరించెడునట్లు లప్పు డవుడు
చెవిఁజేరి నిక్కి నచ్చెరువుగా గుహ్యంబుఁ
జెప్పి రంజించున ట్లొప్పు చోకటఁ
జెక్కిలిఁ దాకును జేరి ముద్దాడి స్వ
ప్రేమంబుఁ దివిరి చూపించునట్లు
శీర్షంబుఁ దాకును జినుకుచు హిమకణా
వలి నభిషేకంబు సలుపునట్లు
గీ. చిక్కుఁ బదముల భక్తిని మ్రొక్కునట్లు
మించు దీవియ లట్టిట్టు మెఱయు జ్యోత్స్న
లామహాయోగి చనుదెంచి యాదరించి
చెంతఁ గూర్చున్నవేళ నత్యంతరక్తి. ౫౮

మ. చిరుచేమంతులు మోములఁ హిమకణ
శ్రీ మోదబాష్పంబు ల

బ్బురమై పర్వఁగ హేమకాంతు లెడరన్
బుష్పౌత్తులన్ విచ్చి సా
దరపుంజూపులఁజూచి పుష్పాదుల గం
ధంబుల్ వెదఁజల్లు చి
ట్లరుదా స్వాగత మిచ్చు బోధిగుహ డా
యన్ వచ్చు సిద్ధాళికిన్. ౫౯

చ. దమనము లెల్ల వేళల ము
దంబునఁ బోలెను దావిఁ దాపసో
త్తమునకు ఘ్రాణతర్పణము
దా మొనరించుచునుండ నాత్మమో
దము గనఁచుండుఁగాని యువి
తాళదు కందునోయంచు హింససే
యుమిదె వ్రతంబుగాదె పర
మార్ధవిదుండగు యోగిమాళికిన్. ౬౦

ఉ. కాలికిఁ గ్రిందుగా నెసఁగు
గడ్డిని జూడక త్రొక్కి యయ్యయో
కాలవశంబుగా నిటులు
గల్గెను హింస యటంచు దత్తృణం
బుల్ లలితంబుగా సరిది
పోమెదు మానులు మూఢచిత్త మ
ర్త్యాళియుఁబోలెఁ బూజ కని
యూరడిఁ బుష్పములన్ గ్రసింతురే. ౬౧

ఉ. చెట్టునఁ బూవు చక్కఁ విక
సింపగ మానన మంతనిండు నా
చెట్టునకున్ సుఖం బగును
జెన్కని చో నవె రాలిపోయెడున్
జెట్టుతనంబునన్ జనులు
చెట్టులయందము కన్నులారగ ను
న్నట్టులు చూడలేక పువు
లక్కట పొట్టను బెట్టికొంద్రుగా ౬౨

గీ. ఓమహారాజ కనుగొను మోము పలుపు
లివ్వి శయనింపు మని యటఁ దృణము పెరుగు
ఋషులశయ్యకుఁ గొనవచ్చు నెండుగడ్డి
పచ్చగడ్డినిగని ముదంపడఁగవలయు ౬౩

ఉ. ఆవరణప్రదేశ మిటు
లద్భుతమయ్యెడురీతి వృక్షసం
భావితదివ్యనందనము
భాతి విరాజిలు నీతిబాధలున్
గావిటు యోగికిన్ జెలిమి
కాంద్రును దగ్గఱబంధువర్గమై
యావిమలంపుభూజములె
యాయనకున్ గలిగించు మోదమున్. ౬౪

## ౫. బోధిగుహాభ్యంతరము



గీ. బోధిగుహ, లోనఁ దక్కువపాడవు ; దాని
యెత్తు కొంచెము ; నిలుచుండ నిమ్ముగాదు
ఐహికసుఖార్థిభోగుల కద్ది తగదు
బాగు పద్మాసనస్థులౌ యోగులకును. ౬౫

చ. గుహాయన నేమొ భావమునఁ
గొందఱు తక్కువగాఁ దలంతు రా
గుహాలను స్వేచ్ఛమై మసలు
కొంటకు నిష్టవిహారలీల ల
న్వహము నొసర్చుకొంటకు న
నర్హమటంచని యేస్తు రక్కటా
మహితవివేక మిట్లనెడు
మానవకోటికి నెట్టు గల్గునో. ౬౬

క. గునకర్థ మంధకారం
బును "హా" యన నాశకంబుపొందుట నీరెం
డును నంధకారనాశక
మనితోచుంగా గుహాపదార్థం బరయన్. ౬౭

చ. మహి ననుచుంత్రు కొందఱిటు
మానుసలమంచును ముక్కు మూయుచున్
గుహాలను పామరుల్ గలరు
కొంచక లోకులనింద సేయుచున్

విహితములైన కార్యముల
వీడుచునంచును నంతెకాని త
త్సహితము దత్త్వముం గన స
మర్థులుగా రటువల్కు మానవుల్. ౧౮

ఉ. కర్మమె గొప్ప దండ్రు తమ
కర్మముచేతనె బ్రహ్మమందు స
న్నిర్మలవృత్తిమైఁ గలయ
నేర్తు మటందురు జ్ఞానయుక్తతన్
గర్మమె చేయువారమని
కాఱులుఁ బల్కుదురైనఁగాని త
న్మర్మ మెఱుంగ కూరకయె
మానులు చేరుదురా ! గుహాస్థలిన్. ౧౯

ఉ. తత్త్వ మనంగ నేమొ నర
తత్త్వము లుండునొ యెన్ని రూపులన్
దత్త్వ మెఱుంగ నేగఁదగు
ధర్మపథంబులు నెవ్వియో యెటుల్
తత్త్వము వేదశాస్త్రములఁ
దజ్ఞులు తెల్పిరో కానకుండ దు
స్తత్త్వము లన్యధర్మముల
సంగతిమై వచియింత్రు దుర్మతుల్. ౨౦

మ. భయమున్ గూర్చెడు నన్యధర్మముల కే
ప్రాధాన్యముం జూపు చ

ధ్యయనంబుఁ బోసరించి స్వీయ మగున
[illegible]ంబు ప్రాప్తంబుగా
నయ మొప్పన్ జగనేసినట్టి ప్రజ కాంక్ష
నంబె స్రష్టాపహో
మయమై వర్తిలు కెంగేకిం జెమడు రా
మర్త్యుల్ మహావిష్ణులై. ౨౦

ఉ. వ్యాసశుకాదిసత్తముల
వల్లనె భారతీముఖ్యకావ్యముల్
భాసితె లోకమందు ముని
వాల్మీకి యల్లిఁడె గాఁడె లోకసం
త్రాసకబహ్వనర్థములఁ
దప్పక మాన్పరె కుంభజాదు లా
వాసము లాగుహాళిగఁ ;
వారికి లోపము సంభవించెనే ? ౨౧

ఉ. స్వార్థపరుల్ నగర్భ్యులు వి
శంకితఁ బల్కెడు రల్పవాక్యముల్
వ్యర్థులు లోకు లాగతిని
వాదము సేయుదు రల్పబుద్ధి మో
క్షార్థవివేకవంతులు స
మర్థులు తాపసు లేడ నల్పభా
వార్థవిలోలు లజ్ఞులగు
నట్టిరువీరలు నేఁడ నెన్నఁగన్. 23

ఉ. ఆదియనంతమై విమల
మై యఖిలాస్పదమై యవాచ్యమై
మోదసుపూర్ణమై గుణవి
ముక్తమునై నిగతప్రదీప్తమై
భేదవిహీనమై యఖిల
విద్యకవిద్యకు మూలహేతువై
వాదవిదూరమై వెలుఁగు
బ్రహ్మ మఖండచిదాత్మభాసమై. ౨౮

శా. కాదవ్యక్తము నామహత్తయిననుం
గా దద్దహంకారమున్
గా దా బ్రహ్మము బుద్ధియుఁ మనమునున్
గా ; దద్ది చిత్తంబునన్
గా ; దేలీలను బంచసంఖ్యగల త
న్మాత్రల్ మహాభూతముల్
గా ; దానిర్మల మాఢశేంద్రియములున్
గా ; దన్య మన్నింటికిన్. ౨౯

ఉ. నాస్తియటంచుఁ బల్కుటకు
నయ్యది సాధ్యము గాద యేరికిన్
నాస్తియటందు రెవ్వ రటు
లాడెడు నాత్మ యొకండు లేనిచో
నాస్తియనంగ నెట్టులగు
నాత్మవిఘాతముగాదె నాస్తితఁ

నాస్తియటంచు, తత్పరమ
 నంతసుగా స్థిరవృత్తి నిల్వదే. ౨౬

ఉ. రజ్జున సర్పభావమును
 రాజితభావము శుక్తి నట్టు ల
ట్లీజగమెల్ల భాసిలెడు
 నేర్పడి బ్రహ్మమునం దవిద్యచేన్
సజ్జను లాయవిద్యయను
 సంతమసంబును జ్ఞానదీప్తిచే
నిర్జనసేయ బ్రహ్మము స
 ముజ్జ్వల తేజమునన్ గనంబడున్. ౨౭

ఉ. మాయను జన్మమృత్యుయుత
 మర్త్యశరీరము గాంచి యంతటన్
మాయఁ దరింపలేక భవ
 మగ్నులు సంతతదుఃఖపూరితుల్
మాయను భ్రాంతిసంయుతులు
 మాంస్యమునన్ గృశియింత్రు మూఢు లీ
హేయవిమోహసంస్మృతి దు
 రేషణముల్ కడుబాధ సేయఁగన్. ౨౮

ఉ. ఈభవవార్ధి నెల్లపుడు
 నెందఱో మున్గుచు నున్నవారలై
యీభయదస్థితిన్ గనియు
 హీనులు జీవితకాలమెల్ల మా

కేభయ మావహిల్లదని
మెంచుచు వర్తిలుచుందు రెల్ల యా
హా! భవపాశబద్ధహృద
యస్థితు లక్కట! యిట్టివేగదా. ౭౯

ఉ. నాలుఁగురీతులన్ జనము
నన్‌గల తత్త్వము తద్గుణాలచేఁ
గ్రాలును వేఱు వేఱుగను
కర్మము ధ్యానము జ్ఞానభక్తులై
కాలము దేశమున్ గని య
ఖండితవృత్తి సమర్థసాధనం
బోలి నొనర్చు మానవుల
కున్నతఁపుంగతి నొందగా సగుఁ. ౮౦

ఉ. ఎల్లర కొక్కతత్త్వమును
నేకమె యోగమునంట కల్లయా
నుల్లమునన్ నిజార్థమగు
యోగముఁ బూనక యుండునట్టి వా
రెల్లరు గమ్యమున్ గనక
యే, పెడత్రోవనఁ బోవుపాంథులై,
పొల్లుగ నెన్నొజన్మములఁ
బూని వృథాశ్రము లొందురేగదా. ౮౧

మ. యమమున్ నీమము నాసనంబు మఱి ప్రా
ణాయామమున్ ధ్యాన ము

ద్యమ మొప్పన్ ధరియించి ధారణము ప్ర
త్యాహారమున్ గూడగన్
విమలంబైన సమాధినుండ గుహలో
విశ్వంబునం దర్హాముల్
భ్రమ నిండ్లన్ సలుపంగ యోగముల నా
పత్తుల్ ఘటిల్లున్ జుమా. ౧౨

ఉ. వృత్తుల నన్నిఁటిన్ దఱిమి
రిత్తమనంబును గూడఁ బాసి య
త్యుత్తమరీతి న స్థితను
న్నూర్జితవృత్తిఁ ద్యజించి యద్వయా
యత్తముఁజేసి యాత్మఁ గడు
నబ్బురమౌనటు బ్రహ్మ తానయై
యుత్తముఁడైన యోగి వెలుఁ
గొందెడు నల్పు లటుండ నేర్తురే. ౧౩

ఉ. ఏము తరింపఁగాఁ దలతు
మిందుల నుండఁగఁ జాలమంచు ని
ష్కామతనై ముముక్షు లగు
సత్పురుషాళికిఁ దత్త్వనిర్ణయం
బాసహితాత్ము లాదిమును
లద్భుతశక్తిని వేదరూపతన్
బ్రేమను నల్పి రీవిధము
వేమఱు బోధకుచే నెఱుంగనా. ౧౪

ఉ. తుచ్ఛసుఖంబులన్ దొఱంగి
తూర్ణముగా నిలువీడి బంధముల్
స్వేచ్ఛను ద్రెంచి యోగమున
నీప్సితసాధనమున్ బొనర్పగా
నిచ్ఛగలట్టిమానవుల
కిద్ధర నద్రిగుహాళి శ్రేష్ఠమౌ
స్వచ్ఛనివాసముల్ మిగుల
సాహస మాగుహనింద సేయుటల్. ౮౫

శా. ఈసంసారపుబాధతోడ గృహమం
దేయుండి ముక్త్యర్థమై
హీనంబైనను జేయు దుర్ఘటము త
ద్విస్పష్టమౌ ఛిద్రముల్
కానంతల్ గనుదోచి వృద్ధిఁ గనుచున్
గారించు డెందంబు నెం
తో సంతోషము భావశాంతి గుహలం
దుఁ గల్గు నేకాంతతన్. ౮౬

ఉ. కంచె గలట్టిమొక్కకును
గల్గును సేమ మదుండ దేనియుఁ
గొంచియుమేని రూపము మి
గుల్ గనకుండను మేయు జంతువుల్
మంచి గుహానివాస మొక
మర్త్యునియున్నతజీవనంబుకై

యంచితలక్షణంబు విమ
యావళి బారికిఁ దప్పుకొంటకున్. ౮౭

ఉ. కావున నేకతంబున న
కారణభక్తిని నిశ్చలంబుగాఁ
బోవిడి లోకముఁ గుహకుఁ
బోయినవారిని నిందసేయగాఁ
బోవు టనర్థమే యగును
బుణ్యతమంబగు మాతృభూమియం
దావిధమైన యోగమున
సద్భుతశక్తులు భారతప్రజల్. ౮౮

మ. ఒకసంకల్పముతోడ నుండి జగమం
దోంకారభావంబుతో
సకలంబుల్ గనఁగల్గు లోకముల క
ష్టంబుల్ స్వతేజంబునన్
వికలంబుల్ గ నొనర్చు నేమ మిఁకఁ ద
ద్విఖ్యాతసద్వృత్తిచే
సకలంకుం డగు యోగిపర్యుఁడు మహా
సంబాత్మకుం డల్పుఁడే. ౮౯

చ. గురువరుఁ డిచ్చు నావరమ
గోప్యమహోత్తరలక్ష్యభావమున్
గురుతుగ నొక్కచక్రమునఁ
గూర్చి యచంచలభక్తియుక్తుఁడై

యరుదగు శక్తికుండలిని
యద్భుతరీతి సహస్రపత్రమం
దు, రహి వెలుంగఁగా నఘవి
దూరుఁడు తాపసి యుండుఁ దద్గుహన్. ౯౦

గీ. బోధిగుహ పుణ్యగుహాయయి పొదలి యోగి
పుంగవాళికి నావాసముగఁ దనర్చి,
విశ్వమోక్షార్థకల్యాణవిభవమునకుఁ
గారణం బగు నాచంద్రతారకముగ. ౯౧

# మానవోదంతము *



సీ. శ్రీవత్సలాంఛనాశ్రితరక్షకుండు స
కలచరాచరవిశ్వకారణుండు
పరమాత్ముఁ డుత్కటప్రళయపాథోధిని
వటపత్రశాయియై బాలలీల
కుడిపదాంగుష్ఠంబుఁ గుడుచుకొనుచు నుండ
నబ్బాలు నాభితోయజమునందు
జనియించి శారదాసహితుఁడై విధి వేద
మంత్రరాజములఁ జిన్మయునిఁ బొగడి
గీ. దేవ! భవదీయ మైన యాదేశములను
దివ్యసంకల్ప! ఘటయింతుఁ దెల్పు మన ని
ఖిలచరాచరరూపసంకీర్ణజగము
సృష్టి సేయంగఁ బరుఁ డాజ్ఞ సేసి నంత. ౧

సీ. మొదలఁ బ్రళయమహాంబుధుల నింకించి త
ద్బ్రహ్మాండభాండంబు బయలు వఱిచి
మిట్టు పల్లంబులు మేరలు తెలియఁ జే
సి గిరుల నదుల విశేషముగను

---

* ఇందు నన్నయభట్టారకనియతిప్రాసనియమముల ననుసరించి పదునాలువిధము లగుసీసపద్యములు గలవు.

నిర్మించి తరులతానివహంబుతో మృగ
పక్షికీటంబు లపారజాతు
లగునట్లుఁ గల్పించి యఖిలసురాసుర
యక్షగంధర్వాద్యనంతసృష్టి
ఆ. యందు మనుజలోక మనుచు చాతుర్వర్ణ్య
సహితముగను గూర్చి విహితవృత్తి
నాల్గుపదులయేండ్లు నరులకు నాయువుఁ
గలుగు నట్లు చేసె నలువ నియతి.
సీ. మానవుల్ విజ్ఞానమానధనుల్ నిరం
తరదుఃఖమున మున్గి తమమనముల
నాలోచనంబు లత్యంతంబు సేసి రి
య్యది యేమికర్మ మియ్యజుఁడు మనకు
నల్ప దేం డ్లాయు వనాలోచితముగఁ జే
సెను మృగవిహగాదిజీవులకును
నెక్కు డాయువు నిచ్చె నిది యేటి యన్యాయ
మకట! యిప్పది యేఁడులరుగు నిద్ర
తే. నరుగు శిశుతను పదియుఁ బదరుగు ముదిమి
భోగభాగ్యంబు లేక నేడ పుణ్య మేడ
విద్దియలు నేడ ముచ్చటల్ పెద్దు లేడ
మోస మయ్యెను మనకు మోమోట మేల.
సీ. వేదవేదాంగాదివిద్దియ లెట్టులు
వేదాంతసారసంవిత్తి యెట్లు

భావజభవభోగబంధసౌఖ్యం బెట్లు
 పుత్రికాపుత్రసమ్మోద మెట్లు
యజనాదిసత్కర్మ లాచరించుట యెట్లు
 సంసారముఁ దరింపఁ జాలు టెట్లు
సభలు సిద్ధాంతముల్ సరసకావ్యము లెట్లు
 బహువిధకల్యాణసంపద లవెట్లు
ఆ. మఱియు యోగవిద్య నెఱుఁగుట యెట్టులు
వననివాసమునను మనుట యెట్లు
పరమయోగ్యమైన నరజీవనంబు ని
ష్ఫలత నొందె నకట! నలువనియతి. ౪

సీ. కష్ట మియ్యది యని గాసిలి జనములు
 నవసి యారట మొంది వివశు లగుచుఁ
దూలుచుఁ బొక్కుచు దుఃఖించి చిక్కుచుఁ
 బొగులుచు వందురి సగ మగుచును
నశ్రుపూరంబుల నంశుకవ్రాతంబు
 తడియఁగఁ జెవులును గడియలు బడ
బ్రహ్మఁ జేరఁగఁ బోయి ప్రాఁబల్కులను వాని
 సతిమనోహారముగా స్తుతి యొనర్చి
తే. మెచ్చఁ జేసియు దేవ! యమేయగుణుఁడ!
వంత గలిగెను నలువదివత్సరంబు
లల్ప మగునాయు విచ్చుట నకట! మమ్ముఁ
గావు పూర్ణాయువు నొసంగి కమలగర్భ! ౫

సీ. విధి యాలకించి యెవ్విధి వీరిఁ దృప్తుల
గావింతు వీరలు భావిసృష్టి
కాధారభూతు లకారణంబుగ వీరిఁ
ద్రోసిపుచ్చుట చాలదోస మనుచుఁ
జింతించి, యుండుఁడు శీఘ్రంబ మీకోర్కెఁ
దీర్తును దృప్తిని గూర్తు మీకు
నాసృష్టియం దగ్రసందనుల్ మీరలు
మిమ్ముఁ గాదన నాకు సమ్మతంబె
ఆ. యనుచు వాయసముల నప్పుడ రప్పించి
గారవించి సుఖులె మీర లనుచు
క్షేమ మరసి వాని చెవిలోన బుజ్జవం
బొప్ప నరులఁ గూర్చి చెప్పఁ దొడఁగె.
సీ. వినుఁడు వాయసము లవితథవృత్తిని నేను
సృష్టిఁ జేసితి నందు శిష్టులైన
మానవు లరయ ననూనసత్త్వాంచితుల్
నలువదేండ్లాయువువలనఁ దృప్తి
నందక వర్షంబు లధిక మర్థింప మి
మ్మిందు రావించితి ముందు వేయి
వత్సరంబుల మీరు వలచిన ట్లిచ్చితి
నం దిర్వదేండ్లనువంద మీర
తే. లిందు వీరికి దయను పే జొంపుమాట
లాడఁ జన ది ష్టదేమని యందు రేని

వేయిహాయనములు మీకుఁ గాయమాత్ర
కష్ట; మం దిర్వ దటిగినఁ గాదె మేలు. ౭

సీ. వెనుకటికల్పంబు విలసిల్లి నప్పుడు
పాపభూయిష్ఠానుతాపరహిత
జీవనంబులచే విశేషమౌ ప్రారబ్ధ
మనుభవింపఁగ నిట్టి మనుగడకును
దావల మైతిరి ధర నొక్క కష్టంపు
దినము తోఁచును వేయి దినము లట్లు
సుఖజీవనం బైనచో యుగం బైన త
త్క్షణము తేఁగెడు నొక్క క్షణము వోలె

ఆ. కనుకఁ జింత వీడి ఘనమని యెంచక
యీయు వలయు నన్న నాయసములు
సమ్మతించి యొక వరమ్మును బ్రార్థించి
ధాత తోడ నవె వినీతవృత్తి. ౮

సీ. దేవదేవ! వినుము నీవ సర్వాత్ముండ
వీవుఁ బల్కినయట్టు లిత్తు మిర్వ
దేండ్ల, నరుల్ నల్వదేండ్లు నిండినవెన్క
మా యాయువునుబూని మనినయప్డు
మాలక్షణంబులఁ బోలి చరించెడు
నట్టులు సేయు, మా కంతె చాలు
నని యేగ, మనుజులకును వాయసంబుల
యాయువు నిర్వదేం డ్లవిహతముగ

గీ. నిచ్చి తోడనె చత్వార మిచ్చి యిట్టు
నట్టుఁ జూచుట బెదరుచూ వస్యరీతి
హీనదృష్టియు గౌరవహీనవృత్తి
కాయశోషణాదికములు గలుగఁ జేసె.

సీ. మోదంబుతోడను ఖేదంబుఁ బెనఁగొన
మానవుల్ ధాత సన్మానమునకు
మెచ్చియు మెచ్చక యిచ్చవచ్చినరీతి
గుసగుసల్ వోయిరి కొంద అందు
మన కర్వదేడులే ఘనమని యిచ్చె నీ
యర్వది యేమూల కగును జూడ
నడుగుఁ డింకను బ్రహ్మ, నడుగక పోయిన
నమ్మయుఁ బెట్టకం చనెడి మాట

ఆ. వినరె మీర లసిన వినుతించి యెల్ల రో
యనఘ! చాల దాయువని వచింపఁ
గోపపడక తీర్పఁ గోరె నాతఁడు వాంఛ
నోపినంతవట్టు శాప మిడక. ౧౦

సీ. కానలోపల నొక్కకోనలో నున్నట్టి
ఘనతరోలూకసంఘంబుఁ బిలిచి
మానవుల్ గోరినదాని నెఱింగించి
కాకు లిచ్చిన యీఁగి క్రమముఁ దెలిపి
వేయేండ్లయాయువు గా నొందితిరి మీర
లద్దాన నిరువదిహాయనముల

నిం దటంచును గూబపింపు నాదేశింప
విధి యాజ్ఞగాదను వెఱవు లేక
గీ. మోమహాత్ముఁడ! యిపుడు మే మోర్చి మీర
లన్నియ ట్లీర్ష్యదేండ్లు మా యాయువందు
సైన వారికి మే మిపు నాయువునకుఁ
దగినచిహ్నంబులను వారు దాల్పఁగలయు. ౧౧
సీ. అని చెప్పినంతఁ దద్వినయసంభాషణం
బున మెచ్చియును ఘూకములకు వరము
లొసఁగి వీడ్కొల్పి, యే నొసఁగితి నరుల కా
యువు సర్వదికిఁ బై మఱొక్క యిర్వ
దట్టి యిర్వదేండ్ల బిట్టు నగచుచును
గుడ్లగూబలఁబోల్కి గూఢవృత్తి
నెవరి నెదురలేక వివశులై యేకరీ
తిగ హీనదృష్టితోఁ దేరిచూడ
ఆ. సైన బదులుపల్క నైనను జంకుచు
నుమ్మటంచు మూల్గుచుంట దేహ
బలము లేక మూలవలనను గూర్చుంట
తగినచిహ్నమనియె నగియు బ్రహ్మ. ౧౨
సీ. ఇంతట నూరక చింతలన్నియుఁ బాసి
పోరయ్య మానవులార యనఁగ
ధాతవాక్యంబున వీతసంతోషులై
పోవఁ జూచియుఁ దనిపోవ కునికి

మునుచేసి నట్టి యామనుగడ నెప్పుడి
యేడుల దుర్దశల్ చూడఁ గల్గి
యును వాయసంబులయును ఘూకతతులయు
లక్షణా లివియని వీక్షసేసి
గీ. పూర్వకర్మంపుఁ బ్రేరణమునను గోరి
రిష్ము మఱి యిర్వదేండ్లు మాహిణముఁ గోరి
యాయు వీకఁ జాలు నోధాత యని వచింపఁ
దృష్టిహీనులఁ జూచియుఁ దీవ్రదృష్టి. ౧౩
సీ. నట్టటఁ ద్రోసిన నెట్టి దోసము లేదు
నరుల కింకెట్టులు వరము లిత్తు
వినువక కినియక కసరక కోర్కుల
నిచ్చితి వానికే మెచ్చు లేదు
తృప్తిఁ జెందనివాఁడు సప్తసంఖ్యాకంబు
లగు ద్వీపములఁ జక్కనగునె తలఁప
నియ్యాదె పరమాయు వియ్యురగంబులఁ
బిల్చి యిర్వది యిత్తు నిల్చు నూఱు
ఆ. ననియు సర్పములను నాహ్వాన మొనరించి
చెప్పు నిర్వదియ నొప్పె నవ్వి
యేండ్ల నల్లె వయసు నిచ్చుచోఁ దమచిహ్వా
ములను నరులు దాల్పవలయు ననుచు. ౧౪
సీ. అదియె కారణ మెనుబది నిండుసంతనె
నరులకుఁ జిహ్వంబు లరుదు గాఁగ

పావతేడులు వోలెఁ గోపించుచును గాలు
చేతులు లేమియు భీతు గొనుట
ముదుతలకంబుసంబు విదురీతిఁ జర్తంబు
వ్రేలుట నిగనిగ లోలిఁ గనుట
నేత్రంబు లున్నను శ్రోత్రము ల్లేకుంట
శ్రోత్రంబు లున్నచో నేత్రహీన
గీ. జీవసంబును రెంటికిఁ దావులేమి
కానికష్టంబు లందందఁ గల్గి చెడుట
శోషణం బంది నెఱపిను వేష మొప్ప
గర్హ్యజీవను లయి నక్రగాము లగుట. ౧౫

సీ. ఆస లింకను బాలు నెవాసంబు లేల మా
రింబ్లకుఁ జనియు నూతేండ్ల బ్రతుకు
మత్సరంబులు మాని సత్సహవాసంబు
దోడను బొందుఁడీ కూడ దనక
యని ధాత చెప్పఁగ విని యర్వ దేడులు
కొని తెచ్చు కొంటమి తినఁగ వలదె
నల్వ దేడులు దాట నిల్వెడి స్వర్గంబుఁ
జెందునాతేఁడు ధన్యుఁ డెందు వృద్ధ
ఆ. దశను శత్రులైన నశపడఁ గూడ దం
చనుచు నేగి రాదిమనుజు లిట్టి
దాని వినినఁ జదువ మానవోదంతంబు
మిగుల శుభము లెసఁగును గలి పాయు. ౧౬



## యోగిని

చ. ఒకఁడను బంధు లింటను మ
హోత్సవముల్ గన నూరి కేగుచున్
శకట మొకండు మార్గమునఁ
జాగుచు నుండగఁ బూర్వమిత్రుఁ డం
దొకరుఁడు బాలు నొక్కని న
నూహ్యరుజాతురుఁ దాను సవ్వయుల్
వికలమనస్కుఁడై కొనుచు
వేగమె పోవుటఁ గాంచి యంతటన్. ౧

ఉ. ఆతనిఁ జూచి నే నపుడె
"యచ్యుతుఁడా యెటఁ బోవుచుంటి వెం
తో తడవయ్యె నిన్నుఁ గని
తోడుల కందఱకున్ శుభంబె గా,
భీతిలిన ట్లొకించుక గ
భీరత వాసి నటుంటి వేమి? నీ
వీతఱి నిట్టు లుండుటకు
హేతు వదెయ్యది? వీర లెవ్వరో?" ౨

చ. అన ననుఁ బోల్చి యాతఁ డను
నద్భుతమున్ ముదమున్ దలిర్ప "నో
యనుఁగువయస్య! యింతపుడె
యల్ల బడిన్ నినుఁ గంటి నేర్చుచున్

విను పదియేఁడులయి యనము
వేర్పడినన్ బదినూర్లు యేండ్లటుల్
మనమునఁ దోఁచు నాకు శుభ
మా గృహమండలి యెల్లవారికిన్ ?" 3

ఉ. పాప మదేమొ దాశరథి
బాలకుమారుఁడు వీఁడు బుద్ధిసం
దీపితుఁ డౌచు విద్దెలను
దెల్విని దేటను నేర్చుచుండ నే
పాపపురోగమో సుఖముఁ
బా పొనరించెను సంధి పుట్టి సం
తాపముఁ జెంద వీని నిజ
ధామముఁ జేరుపఁ గొంచుఁ బోయెదన్. ౪

క. ఈముదుసలి యీబాలుని
వేమఱుఁ గనుపెట్టియుండి వివిధపదార్థ
స్తోమంబుల నిడి పెంచెడు
నే మఱక, వసింతసుఖము మెట్లోర్చు నొకో. ౫

చ. బాలునితల్లి చిన్నపుడె
చచ్చెది మృత్యువు కోరఁ దల్లి కాఁ
బోలు నటంచు నెల్లజన
ముల్ భ్రమఁ జెందెడురీతిఁ బెంచు గో
రాల భరించుచున్ గనిక
రంబున సాదరపూర్ణచిత్తయై

యీ లలనామణిన్ దెలియ
మీాతనికిఁ దలితల్లిగా సఖా. ౬

ఉ. అన్న! బిరాన రమ్ము సుఖ
మా? మఱి యెక్కడ నుంటి వింతసే
పెన్నఁగరాక చిక్కితి వీఁ
కేమియు వింతలు లేవుగాదె? యాఁ
కొన్నది బొజ్జ లెమ్మిపుడె
కొందువు పాలును బువ్వయంచు నీ
చిన్నికుమారునిన్ గని వ
చించును జేరిచి యవ్వ కౌఁగిటన్. ౭

ఉ. ఎన్నఁడుఁ గావు పట్టి యిటు
లేటికి యీఁగతి నున్నవాఁడ వం
చెన్నిరొ రీతులన్ దడవి
యింగువ జీరయొ వా మిఁ కేమొ యా
పన్నినిఁ జూచి మందుల న
పారకృపన్ దినిపించు చుండు న
త్యున్నత మైన యవ్వదయ
కొండు లిఁకెవ్వరు సాటి రారుగా. ౮

ఉ. పెన్నిధిఁగాఁ దలంచుకొను
బిడ్డను పేదఱికంబునందు నా
పిన్నను బ్రోవ కన్నపిన
పెద్దలకాళుల గద్దులన్ స్పృశిం

చ॥ నయశీల బాలకాని
శోక మడంచును సౌఖ్య మిచ్చి సం
పన్నుని సేయు విద్దియలు
పట్టుపడంగను జేయు నిత్యమున్. ౯

ఉ. ప్రోన్నతిఁ జెందు బాలకుఁడు
పుణ్యములున్ ఫలియించు జ్ఞానసం
పన్నుఁ డగున్ మదీయ మగు
ప్రాణము సార్థకమై తరించు నా
పన్నశరణ్య వేఁడుదును
బాలునిఁ బ్రోవ నహర్నిశంబు మా
యన్నయశంబె మోక్షమని
యోగుల నెంచుదు నంచుఁ బల్కెడున్. ౧౦

ఉ. ఎన్నికఁ గన్నటుల్ భువి న
భీప్సితముల్ నెఱవేఱి నట్లు బల్
మన్ననఁ జెందినట్టు లను
మానము లన్నియుఁ బాసినట్లు వి
ద్వన్నతిఁ గ్రమైన యట్లు భవ
తారక మోదము నందినట్లు తా
నెన్నెదు, నవ్వ బాలకు ను
ఖేచ్ఛలు పూరణమందు వేళలన్. ౧౧

శా. అంచుండన్ జ్వరసంధి హెచ్చుటను హా
హాకారముల్ సేయుచున్

బంచల్ చింపుచుఁ దిట్లు తిట్టుచును నా
బాలుండు "రారో మిమున్
సంచిన్ దూరిచి బంగిఁ జేసెద నిదే
సత్త్వైకభీముండ నే"
నంచున్ దూఁకెను బండి నుండి యపు డే
నాబిడ్డపైఁ బ్రేమచేన్. ౧౨

ఉ. సాయముఁ జేసి బండి నిడి
చట్టలు దగ్గఱ బండిపట్టెకున్
బాయని యట్లు గట్టి వెడ
పాటలు పాడకు నోరు మూయు మ
బ్బాయని మందలించి యిఁక
భద్ర మటంచును మిత్రుతోడ నేఁ
బోయెద నయ్య మిత్ర సెల
వున్ గొనినా విని యవ్వ యిట్లనున్. ౧౩

ఉ. "ఓయి మహానుభావ! నిలు
మొక్కటిఁ గోరెదఁ జెప్పి యేగుమా
నాయనుఁగున్న సుంగితఁ డ
నామయుఁ డయ్యెడు మార్గమేది తం
డ్రీ! యిటువంటిరోగముల
నెక్కడ నైనను జూచి యుంటివా?
నామొద చల్లఁగాఁ దెలుపు
నామనమందు మసంగఁ జయ్యనన్. ౧౪

సీ. ఈపసితనాసక్తై హరి హ
రీ! యిటుకొంటిని నాదుప్రాణముల్
ప్రాపితం డంచు నెంచితిని
భాగ్య మదెట్టాలు గాఁగ నున్నదో
శాపము వెట్టినట్టు లిటు
సంఘటన మయ్యెను పాడుగోగ మీ
తేఁపకాఁ గోలుకోనియెడఁ
దీఱుదు నూతనో గోతనో తుదిన్" ౧౫

శా. ఈ రీతిం బరితాప మందుచుఁ గరం
బీగ్గలుతో నవ్వ నా
తో తత్ప్రార్థక నాచి పల్కఁ గని తో
త్రోడన భయం బందితిన్
బీరా లెచ్చటి కేఁగెనో కడుదిగుల్
బెట్టెత్తె నాయుల్లమం
దారాత్రిన్ గల లేమి వచ్చెడునో యం
త్రైసన్ ధృతిం బూనితిన్. ౧౬

ఉ. ఆశ యదెట్టిదో నరుల
నందనిమ్రాకులఁ బట్టు గోయఁగాఁ
బాశము వైచి లాగు, నది
వారిని ముగ్గిన వాని నక్కటా
లేశము గట్టి పోచఁ గొని
లేవఁ దలంపిడు, దప్పిఁ దీర్చ నా

పోశన మెండమావుల ర
యంబున జేయఁగ నూహఁ గొల్పెడున్. ౧౭

క. ముడుతలుగల మోమును దన
బుడుతకునై భీకరముగ ముడిచి యమునకున్
జడుతునె నే నను నీయమ
పడఁతులు సాహసిక లనుచుఁ బల్కెరి ప్రాజ్ఞుల్. ౧౮

మ. అని చింతించియు నిట్లు బల్కితిని నే
"నమ్మా దిగుల్ సెందఁగా
ఘనమా యియ్యది గోటఁ దీఱును గదా
గన్గోమె ప్రాణాలపై
ననుమానంబును గొల్పుజాడ్యములు వే
లం దిద్ది యేమాత్రమా
వినుమా! నాటికినాఁడు తగ్గు నిది సా
ధ్వీ నమ్ము నామాటలన్" ౧౯

చ. అన విని యవ్వ యిట్లను మ
హామతి నీవు వచించినట్లు గా
గనుదునె యంత భాగ్యము న
ఘంబులు దీఱఁగ వంత లన్నియున్
జనునటు పల్కినాఁడవు స్వ
సంతతి వర్ధిల వేయివత్సరాల్
మనగదవయ్య పుట్టుదు ను
మా ఋణ మీఁగఁగ నీదుకడ్పునన్. ౨౦

క. అని ముదుసలి యనుచుండఁగఁ
గనుఁగొని చిత్రముగ నెలవుఁ గైకొని యోగన్
జనియెను శకటము చే నొకఁ
డని నిల్చితి విస్మయం బెసంగన్ గదురన్. ౨౧

చ. ముదుసలి చూపుచుండిన య
మోఘపుఁ బ్రేమను మోహ మంచుఁ ద
న్మృదుతరచిత్తవృత్తియె య
రిష్టపుఁ జంచలభావ మంచు మం
చిదయను నేమఱంచుఁ బని వ
చింతురు పామరులైన వారలా
యాదనఁ దదంతరంగగత
మహా పద మోహన్మిశ భావ మెంచకే. ౨౨

ఉ. బాలునిజీవమే తనదు
భావముసంపదఁ దదేకవృత్తితోఁ
గాలము దేశమున్ గనవఁ
గల్గినరీతిని నిల్పి క్షేమమున్
బాలుపడంగ నీక హృది
వారణఁ జేసియు భ్రాంతి నవ్వ యీ
పోలికఁ గర్మయోగమును
బూనిన దంచును నూహ సేసెదన్. ౨౩

ఉ. తల్లియొ తండ్రియో హితులో
తాతయొ యవ్వయొ మేనమామయో

పిల్లల సాఁకు చోపికను
విష్ణుని కార్యము నిర్వహింపఁగా
నొల్లవిచో జగంబునను
నూర్జితవృత్తిని వృద్ధి గల్గునే
పల్లవపత్రపుష్పములు
పాదప మందునె పెంప కుండినన్. ౨౮

క. బ్రహ్మోపాసక యోగియు
బ్రహ్మార్పితచిత్తవృత్తి భక్తవరుండున్
బ్రహ్మవిచారజ్ఞానియు
బ్రహ్మాసక్తాత్మ యవ్యపాటియె యుండున్. ౨౯

# స హా స ము

(లార్డు వాలస్లియాచరిత్రనుండి గ్రహింపఁబడినది.)

శా. శ్రీరంజిల్ల దిగంతకీర్తియుతుఁడై
శృంగారధామం బనన్
దేశం గాంచుసిరంగపట్టణమునన్
విఖ్యాతకర్ణాటరా,
జ్యారాధ్యుండగు హైదరాలిసుతఁ ధా
ణాంకున్ బ్రశంసింపఁగా
నేరన్ జాలునె ధాత్రయైన యతనిన్
నిర్మించువాఁ డేనియున్. ౧

చ. ఒకపరి రంగపట్టణాన
మున్నతమాధవగేహమందునన్
ప్రకటముగాఁగ హిందువులు
వచ్చె నివే తిరునాళ్ల టంచుఁ గో
రిక లిగురొత్తఁ బూర్వపుగు
రీతిని నుత్సవము ఘటించి సే
వకుఁ జనుదెంచినట్టి బహు
భక్తజనంబులు గూడఁ దోడరాన్. ౨

ఉ. శ్రీలలనామణిన్ హరినిఁ
జిత్రవిభూషణవస్త్రగంధతాం,

బూలసితాభ్రకుంకుమను
పుష్పవినిర్మితమంజుదామపూ
జాలలితంబుగాఁగ బహు
చామరదండసితాతపత్రముల్
బోలఁగఁ దాల్చి హేమమయ
పుష్యరథంబున నూరి నేగఁగన్. 3

మ. కదలింపంగ నిఁకేమి చెప్పుమను ద
త్కంజాతుసద్వైభవం
బెదురన్ మ్రొక్కెడువారు హారతులు పం
డ్లీయంగ నేతెంచువా
రుఁ దగన్ గీర్తనఁ జేయువారును నటుల్
రోదోంతరం బంతటన్,
మృదువాద్యంబుల నింపువారు నగుడున్
నిస్తుల్యమై యొప్పెనన్. ౪

చ. ఇటువలె వీథులన్ జనుచు
నెచ్చట నాగక యుత్సవంబు నా
డట నొకచోటఁ దుర్కలకు
ధర్మగురుండగు "పీరుజడ్డ" యుక్
గటికి సియింటిముందు చన
గానతఁ డుగ్రుఁడు విగ్రహాంబులన్
బటుగతి నర్చ సేసెను న
వాచ్యుల దండన సేతునం చొగిన్. ౫

స్ర. ప్రేక్షచ్ఛా త్రౌల్పసహోగ్రాం
పెగురుచుఁ జను దేఁ బిట్టుగా నార్చి చంచ
ద్వేషాగ్రహాగ్ని దీప్త
ల్పొలుపంగఁ జేయుచున్ భీమకండంబులున్ రాల్
కాష్ఠేయంబు ల్గవాడు [హంబున్
ల్పాటంబులఁ గొనియున్ గ్రార్య మొప్పగా మ
ప్రక్షోభం బొందునట్టుల్
పరిపక్వవిధుల్గా బా ద్వానర్పంగ నంతన్. ౬

ఉ. ఉత్సవ మంతయున్ జెడియె
నద్భుతకుండై నగు "పీకజడ్డ" యున్
గుత్సితవర్తనంబున
ఘోరమి పంచను హైందరాలికిన్
వత్సలుఁడై నవానికి న
వారితపద్ధతి హైందవావళుల్
తత్సముఖంబునన్ దెలుపఁ
దా విని చింతిలి యాతఁడిట్లనున్. ౭

శా. "ఏమీ! యాతఁడు నింతఁ జేసెనె కడున్
హేయంబుగా నంతలో
మీమానం బెటుపోయె పూరుషులె కా
మీ రెల్లరున్ బారిపోన్
నామాన్యుండగు వీరటంచు జడియం
గాఁబోల దిప్పట్లు రేఁ

పే మీా రందఱు సాత్సవంబుగొని యా
 పీరున్ పడిక్ గెల్వుఁడీ." ౮

చ. అనువచసంబుతో హృదయ
 మం నాఁదయించిన ధైర్యసంపదన్
మునువలెగాక యాయుధస
 మూహముతోఁ గడునుద్యతు ల్వసన్
బనివడి యుత్సవంబుఁగొని
 వచ్చిరి హైందవు లట్టిపీరు నిం
టిని గడువంగఁ బోవఁగ స
 డీన్ గని యాతఁడు నిశ్చితాత్ముఁడై. ౯

మ. వినుఁడీ శిష్యులు కాఫరు ల్లరయగా
 విచ్చేసినా రుబ్ధితే
కనుమానం బిఁక నేల నాశనముగా
 ఖండింపు 'డల్లాఖుదా'
యనుచున్ విగ్రహపూజ సేటనె ముగిం
 పా లోకమం దన్నటుల్
చనఁ జేయంగ సటంచనాఁగఁ గుపితు
 లర్జించి వారందఱున్. ౧౦

మ. స్ర. గరువంబు ల్మీర దూకన్
 గని హారిభజనల్ గట్టిగాఁ జేసి హిందూ
వరు లెల్లన్ తీక్ష్ణఖడ్గ
 ప్రముఖబహువిధప్రౌఢఘాతంబులన్ వే

మఱి పీరున్ వానిశిష్యుల్
మరణభయమునమున్మత్తులై పాఱిపోవన్
దరుమంగన్ విష్ణుసేవ
త్తదుపరిని బ్రమోదంబు నిండంగఁ జెల్లెన్.౧౧
చ. ఉసురులు మేన నుండి యును
నూపిరి వచ్చినవాఁడువోలెఁ దా
వసురుసురై యొడల్ రుధిర
మంటట నిండఁగఁ దూలి యయ్యయో
దెస యిఁక యేది నా కనుచు
దీనముఖంబున నశ్రుధారలున్
విసవిసఁబాఱ హైదరుని
పీఁటికి సేగియు పీరుఁ డిట్లనున్. ౧౨
క. హిందువు లందఱు సత్వన
మందు ననున్ శిష్యసంఘమంతటి జీవం
బుం దోఁచుగఁ గొట్టిరయయ్యో!
యిందర్హుల శిక్షసేసి యేలుము నన్నున్. ౧౩
క. అంటయ మె తడవుగ హైదరు
"గంటిని నేరం బిఁకేమి గావలె మీరున్
గంటిరి యర్హాఫలంబుల్
వింటిని మీచరిత మెల్ల వీనులు మెచ్చన్." ౧౪
చ. అనుటయు "పీరుజడ్డ" విను
హైదరలీసురధాణ శేఖరా

మనది మహమ్మదీయమత
మార్గము విగ్రహపూజ లేని దీ
జనమత రాజ్యమున్ మతము
చాయన వర్తిల నొప్పు నీవునున్
ఘనుఁడ మహమ్మదీయముగఁ
గ్రాలెదు రాజ్యఁపుఁజక్రవర్తివిన్. ౧౫

ఉ. అం చిటుపల్కు "పీరు" కయి
హైదరు గిట్టిన మల్లి తీవ్రతన్
గాంచుచుఁ బల్కె నేరివచ
నం బిది? రాజ్యము మహ్మదీయమే
యంచును నేను దానికి న
రాధిపుఁడంచు వచించినాఁడనే
యించుక యైన? యిట్టివిధ
మెన్నఁ డెఱుంగను మాను వంచనల్. ౧౬

ఉ. వంతను మాని యేగు మన
వాక్కుఁ గనల్పఁగ లేక యొంటరిన్
వింతలు వాదము ల్దెలిపి
"పీరును" నాతని బుద్ధిఁ ద్రిప్పగా
నింతయుఁ జేతగాక సుమ
హీంవిభుపైఁగలకోపభావతన్
బంతముఁ బూని యేగెను ని
వాసముఁ జేయఁగ "ఆరకాటునన్." ౧౭

శా. ఆర్కాటుప్పట్టణమందు నెక్కుడ సుఖం
బా శాంతియున్ గానకే
తర్కం బెంతయుఁ జేసి తుట్టతుదకున్
దా నేగ న్మైసూరికిన్
కర్కోటుం డీతఁ డంచు హైదరు బహి
ష్కారంబుఁ జేయింపఁగాఁ
గోర్కు ల్లానియు “సీరు” చెన్నపురిలోఁ
గోల్పోయె జీవంబులన్. ౧౮

# పెద్దమఱ్ఱి*



వృక్షమా! నీవు పుడమిని వీడి తెమ్మొ!
పాడుపెనుగాలి యెందుండివచ్చె నీకు?
ఎన్నియెన్నియొజన్నంబు లెత్తిమెత్తి
సుంతయైనను మనమున శాంతిలేక
భవజలధివీచిడోలికా భ్రాంతినుండి
విశ్రమముఁ జెందఁ గోరియు వృక్ష. మైతి
వేమహామహుఁడో గాని యింతకంత
బీజమును నాటెనో లేక సాజమైన
గుణముచేతను బండులఁ గొని తినియును
విత్తనము రాల్చె నేద్విజసత్తమంబొ
పుట్టి పెరిగియు నాదిని పురిటిగండ
ములను గడచియు మేకలముకము గడచి
ఏచి నింగికి నెగసియు నెల్లదిశలఁ
గడకుఁ జిమ్ముచు శాఖలు వెడలుచుండ
నూడ లెల్లెడఁ దించియుఁ జూడఁజూడఁ
ప్రళయతాండవమందున బావాలవితతి
లోకముల నాక్రమించునాలోచనమునఁ

---

* ఇది కీ॥ శే॥ నామిత్రులు శివపురపు నాగవీరయ్య ఎం. ఏ. గారి ప్రోత్సాహమున మొట్టమొదటఁ బ్రకటించితిని.

క్రూరముగఁ జూచు మాంటరుప్రభంగి
బలి వడంకఁగ బ్రహ్మాండభాండ మెల్లఁ
బాపములఁ బెంచు మానవస్వామి రీతి
భయముఁ గల్పించుచుండియుఁ బ్రాణిరక్ష
కావున నేనుఁజీకఁ శరణంబ వగుచు
ముందు గల్పించియును సృష్టిమోద మిచ్చు
మేఘుఁడోయనఁ గరుణ సమోఘ మగుచు
తుల్యమే లేని నీ విట్లు దూర మైతి
వృక్షమా! నీవు పుడమిని వీడి తయ్యో!
పాడు పెనుగాలి యెందుండి వచ్చె నీకు? ౧

చల్లఁదనమునకై యల్లనల్లఁ జేరి
పండులను మెక్కి పొట్టల నిండఁ జేసి
పక్షు లెల్లను నిను మెచ్చి బహువిధముల
కుహుకుహూయంచుఁ గోయంచుఁ 'కూ'యటంచు
కేవు మనుచును గీచని కెక్కు మనుచుఁ
గను మనోజ్ఞముగాఁ గూసి కలసిమెలసి
మిథునములుగాను నత్యంత మేటి ప్రేమ
మగడియాపక్షి తనజంట మగువపక్షి
కిట్టులను "ప్రేయసీ! వినుమేవి ముద్దు
లివిగో తెచ్చితి ఫలముల నింపుఁగులుక
నవసుధామాధురీఝరి నవఘళించు

ప్రవిమలజలంబుఁ బుక్కిటఁ బట్టి తెత్తుఁ
బ్రేమసామ్రాజ్యపట్టంబు ప్రియుఁడు మీఁద
నిదిగొ కట్టితి ముద్దుల నిమ్ము చెలియ"
యనిన సిగ్గునఁ దలవంచు చతివపక్షి
ఋతువు నీక్షించి యాసక్తిఁ బతినిగూడి
గర్భము ధరించి కల్గెడు నర్భకులకుఁ
బూరులను బుల్లలను మఱినార నాఁచు
తెల్లఁ గొనివచ్చి నీడంబు నేర్పరించి
గ్రుడ్డులను బెట్టి పొదిగియు బిడ్డలఁ గని
పెంచి పోషించి యాహార మించి, మంచి
చెడ్డ లెఱుఁగక పిల్లలజీవములను
పొట్టఁ బెట్టుక పుట్టలో మిట్టిపడెడు
పాడుపాములచేతను వగచివగచి
యైన నీయుండె సతతబద్ధానురాగ
వృత్తి నీవె స్వర్గంబని హత్తియుండు
పక్షిజాలంబు నడవుల పాలుచేసి
వృక్షమా! నీవు పుడమిని వీడితయ్యొ!
పాడుపెనుగాలి యెందుండివచ్చె నీకు?

"పరులయుపకృతికై చెట్లు ఫలముఁ గాంచుఁ
బరులయుపకృతికై నదు ల్పాఱుచుండుఁ
బరులయుపకృతికై యావు పాలు పిండుఁ

బైకిఁ జూడఁగ మలమలిన వారిముఖము
లందు రాల్చెడిపలుగాకి క్రిందుఁ జనక
గాడఁ దిట్టియు, నీవె స్వర్గం బటంచు
మెచ్చులను నింటికడ కేఁగి మెప్పుఁ జెప్పు
నట్టిసౌభాగ్యగరిమంబు నడవిపాలు
చేసి పోయితి వృక్షమా! వీసమైన
మమ్ము దయఁ గనవైతివి మానసమున
వృక్షమా! నీవు పుడమిని వీడి తెయ్యి!
పాడుపెనుగాలి యెందుండివచ్చె నీకు. 3

పూర్వకాలాన పుణ్యపుఁ బురుషు లెవరొ
నీదుమ్రోలను జలివేంద్ర నిర్మితముగఁ
జేయఁ జతురత్వమునను నజేయమైన
ప్రౌఢయౌ నా ప్రపాబాల పొందుఁ బిల్చి
“నవశిరీషకోమలమగు నట్టిదేహ
మతికఠోరఁపుఁ జైత్రసూర్యాతపమునఁ
గందె డస్సితి నీట నిల్వ మిందుఁ గనుము
చంద్రచందనశీతలచ్ఛాయ నిదిగొ
గగనగంగాతరంగిణీకాంతజలము
నవహసించెడి నిర్మలాత్యంతసురభి
శిహితజలపూరములఁ దృష్ణ రహిత మగును
సుందరాకారమన్మథశోభి నీవు

నేను నవయౌవనోద్భాసి నేమిచెప్ప
నొక్కఁడుండవు నీవు నే నొక్కరితను
పైనఁజెప్పఁగఁ ద్రవ నన్ను బాధ సేయు
నీవ యెఱుఁగుదు చతురత్వనిధివి గాన
యనేకులక్లిష్టకాలంబు లంతమంద
వృక్షమా! నీవు పుడమిని వీడి తయ్యో!
పాడు పెనుగాలి యెందుండివచ్చె నీకు. ౪

ఊరిలో బాలు రండలు నూరు వెడలి
యతివిశాలంబవని చేర యతిముదమున
గ్రోఁతికొమ్మ లాడుచును బ్రొద్దుఁగ్రుంక నాఁడి
"మనముసంచని చేఁకట్లు మనసుకొనియె
బ్రహ్మరాకాసి గల దిఁట బారిపోద"
మంచుఁ బలుగెత్తుమనఁగ వార లజ్జు లరయ
నిత్యనిర్మలసుకృతియౌనీదునాత్మ
దుష్టఘాతాళిఁ బారంగఁ దోలలేదె
వృక్షమా! నీవు పుడమిని వీడి తయ్యో!
పాడుపెనుగాలి యెందుండివచ్చె నీకు? ౫

పిన్నశిశువులు నిన్నుఁ జేరి యెండలందు
గుములుగా విశ్రమించియుఁ గోర్కెఁ దీర
నొండొరుల మేనులను నాకి కొండొకవడి

మందమలయానిలంపుటానంద మంది
పోవుచుందును నిన్నేరు పొంగగలరు
జీవరాసులకోట్లకు జీవమైత్రి
విప్పెడెవ్వరిగోడును జూడకుండ
వృక్షమా! నీవు పుడమిని వీడితయ్యో!
పాడుపెనుగాలి యెందుండి వచ్చె నీకు?

నీదుక్షమ నెన్నఁగా భువి నెవరితరము
వర్షములు రాగ నెండలవాడితనము
వేడిగాడ్పులనిష్ఠురవితతపరుష
బాధ లన్నియు మఱచెదు సాధుత్తమమ
శీతకాలమునందు నశేషవర్ష
బాధలను విస్మరించెదు ప్రథితమతివి.
ఎండకాలాన శీతంపుగందుచలియు
ఆకు రాలుట మోడువై యఖిలదుఃఖ
మనుభవించుట మఱచెదు వినుతిఁ గనుదు
నిత్యసుఖమయు కాలంబు నెఱపుచుందు
బాలకులు కోఁతికొమ్మంచు లోలి నాడి
నిన్ను గలచినచెద్దయము లెమ్మనమున
నిడవు ఫలములకై రాళ్ల నిట్టు నట్టు
లేయువారిని, విస్తళ్ల కిడియునాకు
యోగ్యమగు నాకు లంచను భాగ్యహీను

నౌషధంబుల పాలివి యంచుఁ జెప్పి
చెక్కులను దీసి వ్రేళ్లను జిదుకఁగొట్టు
నట్టిదుర్మార్గజనులను నార్తిపరులఁ
చిచ్చునకుఁ బుడకలంచును బచ్చికొమ్మ
లచ్చుపడఁగఁ గొట్టి యొండించు మ్రుచ్చుజనులఁ
దెగడ సంతోషించుమగల దివ్యమతివి.
సార మింతైనలేని సంసారమందుఁ
దృప్తిపడలనని మోక్షము ప్రాప్త మగును
క్షమవలన నెల్లదోషులు నమలు లగుదు
రనెడు భావంబు యోగుల కందరాని
దానిఁ జాటితి విన్నాళ్లు మానితమతి
ఇంక నీమూర్తిఁ జాలించి యిచ్చలేసి
శాశ్వతానందసామ్రాజ్యసౌఖ్యపదము
పొందఁగాఁ గోరి పెనుగాలిఁ జెంది తీవు.
నాకు దయసేయు కాసంత నాకసౌఖ్య
మిరువురముఁ గలసి యచ్చట నిరివిరిగాని
మెలసియుందము; నాతాపములను జెప్పి
మీశ్వరుని మ్రోల నన్నుఁ బరింపఁజేయు
మోయి సుకృతుఁడ! మోక్షము నూనినావు
లేరు నినుఁబోలు ధన్యులు లేరు లేరు
లేరు కన ముజ్జగంబుల లేరు లేరు. ౭

## ఇరవ్రరు

గీ. మసమసం జనఁ జీఁకటుల్ ముసరుకొనియె
ఘనజఘనభారము మిన్నంటి తనరుకుచులు
కాటుకల మించి నల్లనై గ్రాలుచుండ
నీలవస్త్రపుఁ జీరను నెమ్మిఁ దాల్చి
కదలు ముత్తైదువను బోలియు దిశ లడర
రేలతాంగి పేరంటము రిక్కలనెడు
చిన్నముత్తైదువలఁ బిల్చుచున్న దదిగొ;
పట్టపగ లింతలాడియు బాల్యచేష్ట
లను గలంచినతుంటరులను జాలుమాలుఁ
దిట్టునట్టు నదీకాంత శిఖరి సణఁగె;
గింగురు మనంగ శ్రోత్రముల్ కీచురాళ్లు
వెడలి చెలరేఁగె; మూఁకల నడఁగియున్న
గూబలు భయముఁ గొల్పుచుఁ గూతలిడెను;
దీర్ఘగంభీరనినదముల్ దిశల మూరు
మ్రోఁగుచుండఁగ; సర్పముల్ పుట్టలు విడి
యెల్లయెడలఁ బాఱాడెడు నల్ల మడల;
నక్కలవిరావము లవె కోనల వినఁబడెఁ;
బక్షులు రుతములను మాని వృక్షములను
గూండ్ల డాఁగెను; బొందలును గొప్పచెట్లు

భీకరాకృతిఁ గన్పడెఁ; బ్రేతగణము
తోడ భూతంబు లాడెను; దోఁచెఁ గొఱవి
దయ్యములు లసంగ మిణుఁగురుల్ తళతళమని;
యపరిచితములు వర్తిల్లు నట్టిపల్లె
టూరిబయల వనంబున నుంటి నవ్వా
డిరువు రొకరికి నొకరట నెదురుపడిరి. ౧

పగటిసంగడులెల్లను బడఁగ నొల్ల;
శ్రుతిపుటవిభేదకరశబ్దతతులఁ జెవులు
పగుల దుమ్ములఁ జెలరేఁగ మిగుల ధూస
రితము నగరపట్టణపథంబు సతము నొల్ల;
రచ్చకెక్కి బిడియము నరమర లజ్జ
లేక భుజముల నెత్తి యనేకవిధులఁ
బ్రేలుచుండెడువారల రీతు లొల్లఁ:
బట్టబయలఁ బ్రగల్భతల్ పల్కునట్టి
దుష్టమదమత్తపురుషులతోడు నొల్ల;
నొల్ల వాదముల్; చర్చలు నొల్ల; తగవు
లొల్ల; వికటాట్టహాసంబు లొల్ల నేను;
వలతు నేకాంతవాసంబు; వలతు రాత్రి;
వలతు నిశ్శబ్దసీమలౌ వనపథములు;
వలతు రిక్కలఁ జూడఁగ; వలఁతుఁ జింత;
చూతు లోకంబు నేరిచేఁ జూడఁ బడక;

యాట్రియే నప్డు కనుమేని నిట్టు చూడ
నిరువు రొకరికి నొకరట నెదురుపడిరి.

దీర్ఘ పీవర దేహముల్ తేజరిలఁగఁ
దవిలి నఖశిఖపర్యంతధవళదీర్ఘ
ధౌతవసనముల్ నిండుగాఁ దాల్చి కదిసి
గుసగుసలువోవు తెఱఁగునఁ గోరి నిలచి
రెవ్వరై యుందు రీనిశి నివ్వనమున
నొంటరిగ నుండ హేతు వేముండు నకట!
ప్రియుఁడుఁ బ్రియురాలు నిస్తులప్రేమ వెడలి
తమదుసంకేత మచ్చటఁ దగనొనర్చి
గూఢవేషములను దాల్చి గుసగుసలను
బ్రణయమును దెల్పునట్టి సంభాషణములఁ
జేయుచుండిరో? నిష్ఠురుల్ శ్రీల నపహ
రింప నేయింటఁ గన్నము నుంచవలయు
నంచు నాలోచనములతో నలరి యుందు
నుండిరో? లేక వీర లుద్దండవృత్తి
హత్య లొనరుప నీమేడ నాత్రమంది
గూఢముగఁ జింతసేసెడు క్రూరమతులొ?
అత్తదుండగముల నెంచ నవలి కేఁగు
నింటికోడండ్రొ! కావలిబంటులో లేమొ?
తంత్రసాధకులో యేమొ? మాంత్రికవరు

లేమొ? భూతంబు లయ్యెడు నేమొ? యిట్టు
లిరువు రొకరికి నొక రటు బెదురుపడిరి. ౩

ఎంతయో చింతఁ జేసితి, వింతపడితిఁ
గాని కరిఁ జేర సాహస మూన నైతి;
లోకవృత్తంబుఁ గూర్చి యాలోకపతిని
గూర్చి ప్రకృతిని గూర్చియుఁ గోట్లకొలఁది
యూహ లల్లితిఁ; జీఁకటియును విశేష
ముగ నలమెఁ; బ్రక్కలందున ముందు వెనుక
నెద్దియును దోపదయ్యె సమీక్ష సేయ;
నిట్లు చింతించు చాస్థలి నెంతసేపు
కూరుచుంటినో యెఱుఁగను, గొంతవడికిఁ
గోళ్ళుఁ గూసెను, గ్రమత దిక్కులును నంత
తెల్లనగుచుండఁ దారలు తేజ మెడలి
యొక్కటొక్కటి గను జాఱెఁ; నుదయరక్త
శోభ లెల్లెడ వ్యాపించెఁ; జూడఁజూడ
భానుఁ డప్పుడు కన్నులపండు వయ్యె;
క్రమతఁ గనవయ్యె వనమును; కట్టెదుటను
వల్లకా డున్న తెఱఁగును? బఱఁగు టచట
నొక్క శైవసమాధి, యాప్రక్కలందు
నిలువుగాఁ బాతి సున్నము కలయఁబూసి
యొకటి కొక్కట కెదురుగా నుంచఁబడిన
శిలలు రెం; డంత సంశయచ్ఛేదమయ్యె. ౪

ఇటుల తామసప్రాకృతవృత్తిసహిత
మానసము చూచుఁ బ్రకృతిని వేనవేలు
విధములుగ; భ్రమఁ జెందును వెనుకఁ బొందు
జ్ఞానభానూదయంబు నిస్సంశయముగ
బహుళసంసార తామసబాధ మాన్పి
ప్రకృతినిజవృత్తి స్పష్టత బయలుపఱచి
శంకలను బాపు నాపరసత్య మప్పు
డనుభవించుచు నానంద మందు నరుఁడు.

# భానూదయము



సీ. అరుణారుణప్రభాస్ఫురణంబు దిక్కులఁ
దరుణారుణాశ్వత్థదళముఁ గవియ
నంజననిభతమోఽనంతసంతానంబు
గిరిగుహాగృహముల కరుగుచుండ
రమణీయకలకలారావంబులను గోక
శుకపికకేకు లెచ్చుగ నొనర్ప
సురుచిరకంఠసంశోభితస్వరముల
నాఁకొన్న క్రేఁపు లంబా యనంగ
గీ. కాల మెఱిఁగించు కుక్కుటగళము లెసఁగ
స్వస్వనియతము లగుకార్యవర్తనముల
సుతసతీయుతగృహపతు లున్ముఖులుగాఁగఁ
దూర్పుదిక్కునఁ దోఁచెఁ బ్రత్యూషశోభ. ౧
సీ. ప్రాభాతికము లగుప్రభలు తూఁపుదెస
వెలివెల్లనై తోఁత్తి విశదపఱిచెఁ
దదుపరిఁ బ్రథమసంధ్యారాగములు పర్వి
కుంకుమపంకమున్ శంకఁ గొల్పె
దండెత్తినట్లు సహస్రముద్యద్ద్యుతు
ల్తారకంబులను బోఁ దరిమె నెటకొ
నీలరక్తసితాదినిఖిలదీప్తులు కన
త్కనకవర్ణవిశేషకాంతిఁ దోఁచెఁ

గీ. దళతళలు గొల్పు కిరణము ల్దర్శనీయ
భాగ్యరేఖలువోలె దిగ్వర్గములను
వ్యాప్త మయ్యెను దెల్విలో నలరె జగము
తరణి యుదయించెఁ జిత్రభానుసరణి దివిని.

సీ. విధుబింబసుఖరతిమధురతఁ గోల్పోయి
తొగకన్నె విరహార్తిమొగము ముడిచె
మిత్రసమాగమామేయసౌఖ్యముఁ గాంచి
పద్మిని కాంతిసంపదలఁ బొదలె
నన్యోన్యసాహ్వానవృథాన్వేషణార్త
చక్రవాకద్వంద్వచయము గూడెఁ
గుసుమజమకరందగురుపానసంతుష్ట
మధుకరదంపతు ల్గలసి రేఁగ

గీ. గోత్రపాథోధితరుగిరిక్షేత్రవిహిత
నరసురాసురయక్షకిన్నరవిహంగ
మాపిపీలికబ్రహ్మచరాచరప్ర
పంచ మెల్లెడ సవితృనిప్రభలు వెలుఁగ.

సీ. స్నానసంధ్యాద్యనుష్ఠానకర్మముఁ దీర్చు
వేదపాఠాసక్తవిప్రజనము
మంగళవాదిత్రమాగధగానప్ర
బుద్ధధర్మాసక్తభూవరాజి
కల్యనిర్వర్తితకరణీయులై నిజ
వ్యాపారసక్తులౌ వైశ్యవరులు

భుక్తపర్యుషితాన్నపుష్టులై నాగళ్లు
గట్టి పొలముల దున్ను కర్షకులును
గీ. స్వర్ణకారకసౌచికచర్మకార
రజకశౌండికలుబ్ధకరాజపురుష
తన్తువాయకశిల్పమార్దంగికాదు
లెల్ల రూనిరి నిజవృత్తు లినుఁడు వొడమ. ౪
సీ. ప్రత్యక్షదైవముఁ బ్రార్థింపరే యని
సకలసత్కారముల్ సలుపువారు
మూర్తిత్రయాత్మకపుణ్యరూపుం డని
ధ్యానమీలితచక్షు లైనవారు
సర్వదేహారోగ్యసాధకుండని నమ
స్కృతిశతంబులను సాగిలెడువారు
కష్టసంగ్రామప్రణష్టశూరులగతి
యీతఁడే కనుఁ డని యెన్నువారు
గీ. స్వప్రకాశత మాయాత్మకప్రపంచ
మును సృజించియు వృద్ధిని బొనరిచియును
విలయ మొనరించు నట్టి యావిశ్వరూపుఁ
డుదితుఁ డంచని జనములు ముదితులైరి. ౫

# కాకతీయప్రశంస



సీ. ఆంధ్రక్షమామండలాఖండలుం డైన
రుద్రభూపాలునిర్నిద్రశక్తి
స్వీయరాజ్యప్రజామేయరక్షణశీల
గణపతీంద్రునిలోకవినుతకీర్తి
రుద్రమాంబాకటాక్షోగ్రసుధాసార
సిక్తవర్థితలోకచిత్రరక్తి
వీరప్రతాపరుద్రారూఢసింహాస
నాసక్తవరదండనాథభక్తి
గీ. కారణములుగ నెలకొనఁగలిగి సార్వ
కాలికానూనకీర్తిని గంటివమ్మ
మమ్ము ధన్యులఁ జేసె నీ స్మరణ నేఁడు
రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి. —
సీ. భాషించితివి శైవభక్తి సోమనలీల
జానుతెన్గులఁ దేనెసోనగురియ
వచియించితివి సొంపుఁ బచరింప నభినవ
దండిపోకడల నఖండసరణి
పోషించితివి రామభూవిభుకథ భాస్క
రాదికవీశ్వరామోదఫణితి

ఉత్సహించితి యజ్వసత్సాహసంబున
నుభయభాషాప్రౌఢి సభలు మెచ్చ

గీ. రంగనాథరామాయణరమ్యకావ్య
సారమునఁ బెంచితివి నుడికార మూర!
మమ్ము ధన్యులఁ జేసె నీ స్మరణ. నేఁడు
రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి. ౨

సీ. చాళుక్యధరణీశసద్భక్తియుతదత్త
భద్రేభసంతతి బారౌ ముండె
పాండ్యావనీశసంపాదితాఖిలరత్న
చిహ్నితరథములు సిద్ధ మయ్యె
రాష్ట్రపాలకజితరాజసంప్రేషిత
కరములు ధనపరంపరలు వచ్చె
నానావిదేశాగతానూనవస్తువుల్
వర్తకానీతమై ప్రాప్త మయ్యె

గీ. కనులపండువుగా నిన్ని గాంచినట్టి
పరమశీతలదృష్టిప్రభావ మేమొ
మమ్ము ధన్యులఁ జేసె నీ స్మరణ నేఁడు
రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి. ౩

సీ. అరిరాజరక్తారుణాంబువర్షమె గాని
కరుణ లేదాజిని గాంచినపుడు
ఘనరత్నమణివస్తుకనకదానమె గాని
'నాస్తి' లేదర్థులన్ గాంచినపుడు

నవసుధాస్పదకృతు లవధరించితి గాని
కనలేదు నీరసకావ్య మెపుడు
సత్యధర్మాదిప్రశస్తరీతులె గాని
వినలేదు దుర్జనవిధము లెపుడు
గీ. చంద్రచందననిర్మలసాంద్రకీర్తి
గాని దుష్కీర్తి నెన్నఁడు గాంచలేదు
మమ్ము ధన్యులఁ జేసె నీ స్మరణ నేఁడు
రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి. ౪
సీ. నీ మంగళారావనినదపరంపర
భావిసంపదల సంప్రాప్తిఁ జేయు
నీశూరవరఘోరనిష్ఠురవీర్యంబు
వేడిక్రొన్నెత్తురుల్ విరియఁ జేయు
నీ యాంధ్రసత్సుధానిర్మలసూక్తులు
కావ్యకౌతుకలక్ష్మిఁ గ్రాలఁ జేయు
నీ మతాచారసందీప్తధార్మికజీవ
మార్గమతాసక్తి నలరఁ జేయు-
గీ. నిన్ను ధ్యానింప మోక్షసాధోన్నతప్ర
శాంతతత్వాత్మ కానందసరణి గలుగు
మమ్ము ధన్యులఁ జేసె నీ స్మరణ నేఁడు
రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి. ౫

# ప్రకీర్ణము

## ప్రాచీనదేవాలయశిథిలములు

ఉ. శ్రీయుతరాజరాజకుల
శేఖరుఁ డర్థిజనప్రపోషణా
త్యాయతదానశాలి బహు
ళాంధ్రజనస్తవనీయసద్యశః
కాయుఁడు విష్ణువర్ధనుఁడు
గాదె ఘటించె నమోఘమైన దే
వాయతనంబు జీర్ణమగు
నంచుఁ దలంచెనె యెన్నఁడేనియున్. ౧

ఉ. అల్లదె శాసనంపుశిల
యాలయభిన్నశిలాతటంబులన్
మెల్లన నిల్చి చూపెడు న
మేయమునై తగుపూర్వశోభ మీ
యుల్లములం దలంప మహి
మోన్నతి గుండెల నీరుచేయదే
కల్లయె కాలదేవత య
కారణశత్రువుగాదె యేరికిన్. ౨

మ. అరరే! ఊహా కతీత మెంతటి మహా
ర్హాంబైన కల్యాణమం

దిరమో యిద్ది ప్రతిష్ఠవేళ నృపని
ర్దిష్టాధికంబైన నా
ద్యరమానాదము మంత్రగానము భటా
ద్యశ్రాంతసల్లాపమున్
బరమోత్సాహజనాభివాసము కటా,
వ మ్మయ్యె నిప్పట్టునన్ ? ౩

చ. శతములు వర్షముల్ గడచెఁ
జాల్పడి మ్రొగ్గె విచిత్రశిల్పముల్
కతలయిపోయె నీ ప్రతిభ
గర్వితక్రూరతురుష్కహస్తమ
ర్దితమయి నాశ మందె సము
దీర్ణశిలామయవిగ్రహంబు లీ
వితమును గాంచి కుందెదను
వేంగిప్రభుత్వమహత్వ మెంచియున్. ౪

సీ. ప్రాకారమా యిద్ది పరమాణుతుల్యమై
పొడిపొడియై రాలిపోయె నయ్యొ
మండపస్థలములా మంటిదిబ్బలఁ బోలి
కుప్పలుకుప్పలై కూలిపోయె
శిఖరంబులా యివి శీర్ణమై రూపమే
లేకుండ పుడమిలో లీన మయ్యె
మూర్తియా యిది విరాణ్మూర్తి యయ్యును
నామమాత్రావశేషతాపాత్ర మయ్యె

గీ. ప్రకృతిపురుషసమ్మేళన ప్రకటమైన
జగ మనంతము నం దిట్లు విగతి నందు
నంచుఁ జూపుటకా యిది యహాహా యిట్లు
లయముచెందెను బృథివీలలామయందు. ౫

గీ. అఖిలభారతవంద్యమై యలరునట్టి
వేంగిచాళుక్యశిల్పవిభిన్నగతికి
వేడిరక్తాశ్రుకణముల విడువనట్టి
యాంధ్రసోదరుఁ డుండునే యవనియందు. ౬

## కాలేజి విద్యార్థుల వీడ్కోలు

చ. సిరులకు నాటపట్టు సుఖ
సేవధి, సమ్మదవార్ధి, యార్ద్రిమా
విరినునుశయ్య శ్రాంతులకు
విశ్రుతభూమి రసానుభూతి క
బ్బురమగుపంట క్రీడలకుఁ
బొల్పెసలారు కొతారు స్వేచ్ఛకున్
దెరువు కళాభివృద్ధి, కగు
నిన్నెటు వీడుదు, మమ్మ, కాలెజీ. ౧

చ. గురువులు చెప్పువిద్దియలు
కోరిక విందుము తన్మయస్థితిన్
గురువులబోధ లొక్కయెడఁ
గూడఁ బరీక్షల కాలకింతు మా

గురువులతోడ హాస్యములఁ
గోయని కేకలతోడవిందు మా
గురువులఁ బాయుటెంతటి య
కుంఠితదుఃఖముఁ గూర్చు కాలెజీ. ౨

చ. మరలగ నిందరీవిధ మ
మందరయంబునఁ జేరగల్గునే
మరలగ నిన్నిరోజు లిటు
మాటలు కోటలుదాటఁ జెల్లునే
మరలగ రేపుకద్దనెడి
మాటయెఱుంగక సంతసింతుమే
మరలగ నీదుమోమిటులు
మాన్యతఁ గాంతుమె యయ్యొ కాలెజీ. 3

చ. నినువిడి యేగనున్నమము
నేఁడెటఁ దెత్తువు బత్తెమంద్రు మా
యనుఁగులు తల్లిదండ్రులు, ప్ర
యాసముఁ జెందుచు వృత్తిదాతలన్
గన నివుడేది మీకు నవ
కాశ మిఁకొక్కెడ కేగుమందు రే
మనివచియింతు మమ్మ ప్రబ
లార్తిని సైతు మికెట్లు కాలెజీ. ౪

చ. నినుఁగని ముద్దుముచ్చటల
నీకడ నుండినరోజులెల్ల మా

మనమున నిల్చి భారమును
మాపునుగాక భవంబునందు
నీయనుపమసుందరామృతర
సార్ద్రసుకోమలదివ్యమాధురీ
ఘనము కటాక్షవీక్షణము
గావుత మమ్ముల నెప్డు కాలెజీ.

కా లే జి స మా ధా న ము.

చ. కలకలలాడుమోములను
గాంచి సుఖించితి నిన్నినాళ్లు ని
ష్కలుషహృదంతరంగములఁ
గల్గును సంసృతిభార మిప్డయో
కళలను నేరువున్ గనిన
కాన్పులకంచు విచారమందెదర్
గలుగుత మాయురభ్యుదయ
కాంతులు మీకుఁ బరాత్పరేచ్ఛచేన్. ౬

క ష్ట ము

మ. వరకష్టంబులఁ జెంది మానవులు బ
ల్వాచాటులై యీశ్వరున్
బరమారాధ్యుని నిందసేసెదరు త
ద్భావంబు నూహింపకే

శరణం బద్ది సమస్తసౌఖ్యములకున్
సన్మోక్షమార్గంబునున్
బరమగ్రాహ్యము కష్ట మెల్ల యెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౧

మ. కరమున్ సౌఖ్యముఁ జీవనంబులు సదా
కష్టాంతరప్రాప్తిచేఁ
దిరమై యుండును నెల్లుగాని వెగటై
దీనంబులై తోఁచు ని
ద్ధరఁ గష్టానుభవంబులేక సుఖముల్
దా సారహీనం బగున్
బరమగ్రాహ్యము కష్ట మెల్ల యెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౨

మ. నరు లేవేళ మదంబుఁ జెందుదురు స
న్మానంబుచే వృద్ధిచే
వరబంధువ్రజమిత్రసంతతులచే
వాంఛాప్తిచేఁ గీర్తిచే
గరువం బట్టితఱిన్ శమింప నుఁ వా
ఖడ్గంబుగా నుంకుటన్
బరమగ్రాహ్యము కష్ట మెల్ల యెడలన్
భవ్యంబు చింతింపఁగన్. 3

మ. పరులో బంధులొ యాప్తరీతిని జనుల్
బ్రాప్తంబులా వస్తువుల్

వరుసం బొందుచు నిచ్చ్కకంబుల సదా
వర్తింతు రచ్చోటనే
యొరవుల్ రాతివిధాన వేర్పరచు దా
నో మిత్రులన్ శత్రులన్
బరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౪

మ. గిరులన్ మూలఫలాదులై మనుచుఁ ద
ద్గేహంబులో కాసలన్
జిరసంతాపితగాత్రులై తపముచేఁ
జెన్నొందు మానీశ్వరుల్
తిరమౌ భక్తిఁ గసంగలేక చెడి రా
దేవిన్ గనన్ జేయుటన్
బరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౫

మ. పరసంతాపనివారణంబు సరుపై
భారంబు ప్రారబ్ధమౌ
పరసంతాపము గుర్తెఱుంగుటయు తా
త్పర్యంబుతో సాయమున్
ద్వరతోఁ జేయగలుంగుటల్ స్వానుభవ
ద్వారంబునన్ జేకురున్
బరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౬

మ. తరణోపాయము మానవాళికి లస
త్త్యాగంబు లన్యార్థమై
చరజంతు ల్నిరతంబుఁ గష్టయుతమౌ
సంసారమం దుంటచే
సరసు ల్త్యాగు లుదారు లూర్జితులు ప్ర
శస్త్యంబునన్ బొందుటన్
బరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౭

మ. క్షర మీజీవముపై విరక్తియును న
క్షయ్యావ్యయబ్రహ్మ మా
కరుణాసాంద్రునిభక్తి నాస్తికునకున్
గల్గంగఁజేయున్ వసుం
ధరపై భక్తివిహీనజీవనుల కా
ధారంబు భక్త్యర్థమై
పరమగ్రాహ్యము కష్ట మెల్లయెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౮

మ. పురుకుత్సుండు పురూరవుండు నలుఁడున్
పూజ్యుండు త్రైశంకునా
పురుహూతుండును కార్తవీర్యనగరుల్
పుణ్యాత్ము లిల్లాండ్రురా
ధరజా ద్రౌపదిభీమపుత్రి మొదలై
ధన్యత్వముం జెందుటన్

బరమగ్రాహ్యము కష్ట మెల్ల యెడలన్
భవ్యంబు చింతింపఁగన్. ౯

## రామరాజపంచరత్నములు

ఉ. రాజకులీన! సద్ధృదయ
రాజితపూర్ణసుఖప్రదీప! తే
జోజితపద్మమిత్ర! భుజ
శోభితభూరిపరాక్రమాద్భుత
శ్రీజయశీల! రంజితప
రీక్షితతత్ప్రకవీంద్రపండితా!
రాజమరాళ! సద్గుణవి
రాజిత! రామసునామశోభితా! ౧

ఉ. చిత్ర మయారె! నీహృదయ
సీమసుగల్గు నుదారమాధురీ
పాత్రత, యుష్మదీయశుభ
పావనగేహమునం జనించు స
త్పాత్రులు పుట్టుతోడనె యు
దారమహత్తరభావశీలురై
మిత్రులు మెచ్చ సత్కృతు ల
మేయముగా నొనరింత్రు నిచ్చలున్. ౨

ఉ. నారదసత్కృపన్ బుధజ
నంబు నుతింపగఁ దల్లిగర్భమం

దే రహి విష్ణుమంత్రమును
నేర్చిన దైత్యకుమారుఁ డేమి సో
దారము నాతిథేయ మను
ధర్మసుమంత్రము జన్మపూర్వమే
నేరువఁ జాలినా మనఁచు
నేర్పునఁజూపి హసింత్రు నీసుతుల్.

చ. అహహా! త్వదీయకమ్రఫల
హారివినమ్రశిరుప్రదేశతా
పహరనుశాంతనిర్మలవి
భాసితశీతలసైకతావళీ
విహరణశీలఘుంఘుమిత
విస్ఫురితాఖిలగంధయుక్తమం
దహితసుమారుతంబుల న
నంతసమాధిని యోగు లుందురుగా.

ఉ. నీవిభవంబు నీసుగుణ
నిర్మలతేజము నీదుభావమున్
నీవినయంబు నీపరమ
నిర్గుణతత్వవిచారణంబులున్
నావిమలార్ద్రకోమలను
నాట్యఝుళంఝుళనాదపూర్ణసం
భావితకావ్యకన్యక క
పారముదం బొనగూర్చె నద్దిరా.

## దుష్టుఁడు

ఉ. పంకిలమైన బుద్ధియు నపాస్తవి
నీతియు దైవభీతి యే
వంక నెఱుంగ రామియును
స్వార్థపరత్వము సజ్జనాళిని
శ్శంకము గేలిసేయుటయు
సాధుతిరస్కరణంబు పాపమున్
జంకును గొంకులేమి యతి
సాహసమున్ గన దుష్టు వర్తనల్ ౧

ఉ. సారములేని సత్కళల
సార మెఱుంగఁడు పట్టిపొల్లు లా
బీరములాఁడ శూరుఁడతి
భీరువు శక్తి నిదర్శనంబునం
దారయ నందఁజుట్టు మఱి
యందకపోయినఁ గాళ్ల బేరముల్;
భారముగావె దుష్టునియ
భాగ్యపునేతలు రత్నగర్భకున్. ౨

ఉ. చేరును బజ్జమోసమునఁ
జేరినచోటనె యింటి వాసముల్
గోరిక లెక్కబెట్టు బలిఁ
గోరు పరార్థము గుల్లమ్రింగు వూ

జారి యపారకుత్సితుఁడు చయ్యన
దుష్టునిఁ జూచి చూడకే
దూరముగాఁ దొలంగుటలు
తోరపుధర్మము సజ్జనాళికిన్.

సామాన్యవస్తునిరసనము

సీ. ఇసుకలు రాలును నినుమంతమృత్తికల్
గాకుండఁగొండలేక్ష్మాతలంబు?
గడ్డిపోచలుఁ పొదల్ కాసరల్ తీగలు
గాకుండ మ్రాకులే కాననములు
ఉడుతలుమిడుతలు మిడుగురుల్ చీమలు
గాకుండ నేనుఁగులే ఘనంపుఁబ్రాణు
లాకొన్న బీదలువాకు నేరనిజనుల్
గాకుండ రాజులే లోకమెల్ల
గీ. పిల్లకాల్వలులేకుండఁ బెద్దనదులు
బాఱఁగాఁజొచ్చెనేభువి భవ్యముగను
ధరనుసామాన్యవస్తు సంతతులయెడల
నీసడింపులు ప్రజలకభ్యాసమకట.

ఓం తత్సత్.

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి_8428-34.